# మహాదార్శనికుడు

## ఖలీల్ జిబ్రాన్



అనువాదం: ఆచార్య 'ధనకుధరం'

# మహాదార్శనికుడు

## ఖలీల్ జిబ్రాన్



అనువాదం :

ఆచార్య 'ధనకుధరం'

# అంకితం

కావలెననియే ఇచ్చెద
నావాడవు లే అటున్న నమ్మికతోడన్
నీ వేమనుకొన్న సరే!
రావెల సాంబశివరాయ! రసవత్ హృదయా!

ముందుగ ననగా లేదని
సందేహం పడకు మయ్యా! సైదోడులమై
బందుగులమైతిమి; మికపై
నిందలు మెప్పులును నాకు నీకున్ సమమే!

భావాలందున తేడా
జీవాణువు లక్షణంబు - చిత్రమ్మైనన్
నీవా నేనా అను టే
దేవాసుర యుద్ధమన్నది విచారింపన్!

పిన్నవుగానీ వయసున -
మిన్నవు నాకన్న కొన్ని మేలిగుణములన్
ఎన్నడు పరుషము లాడవు;
ఎన్నవు పరదోషములెవి ఇట్టట్టనుచున్!

నీది కవితా హృదయము! మ
హోదార్యనికోక్తి మౌక్తికాలంకార
మ్మో దీనిన్ గొని, నీ యెద
లో దాగిన భావము లవలోకింపుమికన్!

— ఆచార్య 'ధనకుధరం'

# ఖలీల్ జిబ్రాన్.....

ఖలీల్ జిబ్రాన్, లెబనాన్ లోని ఖైరీ గ్రామంలో 1883వ సంవత్సరంలో జన్మించాడు. 1931వ సంవత్సరం ఏప్రిల్ నెల 10వ తేదీన తన నలభై ఎనిమిదో ఏట అమెరికాలో అస్తమించాడు. బీరుట్ లోని "విజ్ఞాన కళాశాల" లో విద్యాసముపార్జనం చేశాడు. ప్రపంచంలో లెబనీయుడైన మహాదార్శనికునిగా, అజరామరాణమైన కీర్తి సంపాదించాడు. అతడి అప్రియ సత్య రచనలు, అతడిని దేశ బహిష్కృతిడిని చేసినవి. అతడి చర్చిగూడా అతడికి బహిష్కార పత్రాన్ని ఇచ్చింది. విదేశనివాస సమయంలో కొంతకాలం పారిస్ పట్టణంలో ఉండి చిత్రలేఖనంగూడా నేర్చుకున్నాడు హృదయాన్ని ఉత్పాత లూపించి, మనసులో మహాకల్లోలాన్ని రేపేటట్లుగా మాటలకు ప్రాణంపోసి, మానవుకి మేధకు మహాపక్షాలు కల్పించి, విశ్వాంతరాళంలోకి విహరించేటట్లుగాచేసి, అంతర్ముఖావలోకన సౌభాగ్యం కల్పించిన, మహాప్రతిభావంతమైన ఇతడి రచనలలో ఈ "మహాదార్శనికుడు" ప్రపంచంలో ప్రథమ గణనీయస్థానాన్ని అలంకరించింది. కవి, తత్వవేత్త, చిత్రలేఖకుడు ఐన ఇతడిని, పాశ్చాత్యులు ఇరవయ్యో శతాబ్దపు "డాంటే" మహా కవిగా, ప్రాచ్యఖండం తన ప్రియాచార్యుడిగా సంభావించింది. ఇతడి ప్రతి రచనా కవిత్వపు పోహళింపే. ఇతడిని గురించి క్లాడ్ బ్రాగ్డన్ మహాశయుని పలుకులు ; "ఇతడి శక్తి ఒకానొక ఆధ్యాత్మిక మహాసాగరం నుంచి వెలువడింది. అదేకాకపోతే ఇతడి రచన ఇంతటి పటిష్ఠంగా, సార్వజనీనంగా ఉండేదికాదు. దీన్ని ఇంత గా తీర్చి దిద్దిన రమణీయోదాత్త గంభీర భాషా పాటవం అంతా ఇతడి ప్రతిభా సముత్పన్నం".



# నాలుగుమాటలు . . . .

పుస్తకములు అత్యధిక సంఖ్యలో ప్రచురింప బడడం యీ శతాబ్దపు ప్రత్యేకతలలో ఒకటి. అంతేకాదు, అది మానవ జాతి పురోగమిస్తున్నదనడానికి గల అతి ప్రధానములైన ఆధారములలో నొకటి గూడ. అయితే, ప్రచురింప బడుతూన్న ప్రతి పుస్తకమూ చదువ యోగ్యమైనదేనా? ఇలాంటి సమస్యలు అంత సులభంగా పరిష్కారమయ్యేవికావు. పైగా దీనికి సంబంధించిన చర్చ యిక్కడ అప్రస్తుతం కూడానేమో। ఏది ఏమయినప్పటికీ, పుస్తకములు అసంఖ్యాకంగా వచ్చి పడుతూండడం తోనూ. గ్రంధ పఠనకు మనకున్న కాలము, అవకాశము పరిమితమగుట చేతనూ మనకు కావలసిన పుస్తకములు ఎంతో జాగ్రత్తగా ఎన్నిక చేసుకోవలసిన అవసరం ఏర్పడింది.

కొన్ని పుస్తకములను ఒకే ఒక్కసారి, అదీ ఆదరాబాదరా (తదుపరి కార్యక్రమానికి అడ్డురాకూడదన్నట్లు) చదివేసి మరల వాటివంక అయిన చూడము, వార్తా పత్రికలలాగ. మరికొన్నింటిని నిదానంగా జాగ్రత్తగా అవసరమనుకుంటే ఒకటికి రెండు మూడు పర్యాయములు కూడా చదువుతాము. అంతేకాదు, మరల ఎప్పుడైనా చదువుదామని భద్ర పరుస్తాము కూడా. అయితే మరికొన్ని పుస్తకములను మరల మరల చదువుకొంటూ ఎప్పటి కప్పుడు వానినుండి ఏదోనిత్య నూత్నమైన అమూల్య సంపదను ఆశిస్తూ జీవితాంతము ప్రాణ ప్రదంగా చూచుకుంటూ ఉంటాము. వీనియందలి వస్తువు — జీవితంలో మనం వేసే తప్పటడు

గులు, వాని ఫలితాలు, వానిని సరిదిద్దుకునే మార్గాలూ, జీవితమును ఆదర్శవంతముగా మలచుకొనడానికి అనుసరింపదగు విధానాలు. అందుకే యివి నిత్యజీవితంలో మనకెదురయ్యే చిన్న చిన్న సమస్యల దగ్గరనుండి, జీవితపు విలువలకు సంబంధించిన అతి క్లిష్టములైన సమస్యలవరకు, అనువైన పరిష్కార మార్గాలను సూచిస్తూ, మన సుఖ దుఃఖాలలో భాగస్వామ్యం వహించే ఆప్తమిత్రులలాంటివి.

ఖలీల్ జిబ్రాన్ రచన "ప్రాఫెట్" నకు మిత్రులు ఆచార్య "ధనకుధరం" గారి అనువాదంగా వెలసిన "మహాదార్శనికుడు" చదివితే అనిపించింది "మహాదార్శనికుడు" వంటి మరొక ఆత్మీయుడైన మిత్రుడు యీ జీవితంలో లభ్యపడతాడా – అని. యీ విధంగా అనుకోడానికి, మన జీవిత లక్ష్యాలలోని తేడాలు, మన వ్యక్తిగతమైన అభిప్రాయాలలో అభిరుచులలో గల భేదాలు, మన జీవిత విధానాలకు సంబంధించిన వైవిధ్యాలు ఏవిధముగనూ అడ్డురావు. ఎందుకంటే యావత్తు మానవ జాతిని గూర్చి విశాలపరిధిలో నుండి ఆలోచిస్తూన్నపుడు వీటి ప్రభావం అత్యల్పము గదా!

* * *

ఖలీల్ జిబ్రాన్ జీవిత సర్వస్వం మానవ జీవితాన్ని ప్రేమ మయంగా మలచడం కోసం ఆదర్శ మానవ సమాజాన్ని దర్శించడం కోసం పడిన తపన లేక చేసిన తపస్సు. బాధా మయమైన నేటి మానవ జీవితాన్ని తానాశించిన తాను దర్శించిన అమృత మయమైన రేపటి మానవ జీవితాన్ని ప్రక్క-ప్రక్కనే మన ముందుంచాడు. అంతే కాదు, ఆ రెండింటికీ వారధి నిర్మించి దానిపైనుండి మనల ముందుకుసాగ మంటూన్నాడు. మానవత్వం పునాదిగా మన ఆలోచనా విధానం రూపొంది నప్పుడు క్రమేపి మనలోని చెడు విరిగి మంచిగా పరిణతి చెందుతుందని, అప్పుడు

మానవులు అమృతమూర్తులై భువి స్వర్గము అవుతుందని ఆయన ఆశ. పదార్థ గతమైన కట్టెదుట కన్పించుచున్న ప్రపంచము, దానిలోనూ దాని కతీతముగను ఉండి దానిని నడిపించుచున్న మనకు కనిపించని దివ్యత - యీ రెండింటి విలువలను గుర్తించనిదే జీవితమునకు అర్థము, గమ్యము ఉండవను ఈయన ఆలోచనా విధానమున ప్రాచ్య పాశ్చాత్య తత్త్వముల మేలికలయిక మనకుద్యోతక మవుతుంది. కృషితో కూడిన విజ్ఞాన సముపార్జనము, ప్రేమ పూరితము ఆనందమయము నైన జీవిత విధానము, మానవ జీవితమునకు ధన్యత నొనగూర్చునని తెలియ జెప్పుటే యీ గ్రంథ రచనోద్దేశము.

ఒక వ్యక్తి తన జీవితములో ఎన్నెన్ని వ్యవస్థలతో సంబంధము కలిగి యుండునో వాటన్నింటి యందును అతడు ఏ ఏ విధముల మెలిగిన అతని జీవిత మానంద మయ మగునో, యింత నిర్దుష్టంగా చెప్పుట ఖలీల్ జిబ్రాన్ ప్రత్యేకత యనిన సాహసము కాక పోవచ్చును. ఇక సత్యము చెప్పుట కొన్ని సందర్భముల యందు చాల క్లిష్టమైన సమస్యగా పరిణమించును. ఎట్టి పరిస్థితులలో నైను సత్యమును చెప్పుటలో అతడె న్నడునూ జంకినది, దిగజారినదీ లేదు. ఆయన ప్రతిపాదనలు, వివరణలు ఒక్కొక్కప్పుడు విప్లవాత్మకములుగ నుండుటయు కలదు. నిజమునకు అవి మనల తలక్రిందులు చేయ నవసరము లేదు. మనకవి యట్లు గోచరించుటకు కారణము మనలోని బలహీనతలు. జాగ్రత్తగ పరిశీలించినచో మనకే తెలియును, అవి యన్నియు సత్యములని మన కెంతో యిష్టములని. మనలోని బలహీనతలు మన సద్బుద్ధిని పొర గమ్మినపుడు జరుగు విచిత్ర మేమిటన, మనకు తెలిసినవియు తెలియ నట్లుండుట.

అందుచేత "మహాదార్శనికుడు" గ్రంథము నందలి వస్తువేమిటీ అంటే — మానవ జీవిత సర్వస్వమూ

* * *

ఖలీల్ జిబ్రాన్ మహాతపస్వి, మహాదార్శనికుడు. విశ్వ మానవ కళ్యాణమే ఆయన జీవిత లక్ష్యం. అందుకైన సత్యాన్వేషణకే తన జీవితాన్ని అంకితం చేశాడు. ఆయన దర్శించిన సత్యాన్ని నిర్భయంగా, నిర్దుష్టంగా, పదునుగా, హుందాగా అయితే అత్యంత ప్రేమతో సాను భూతితో, సోదర భావంతో, నిగర్విగా, వినమ్రుడై, మన ముందుం చాడు. కవితా హృదయం కలవాడు గనుక తన భావాలను కడు రమ్యంగా చిత్రీకరించాడు. నిజానికి యిట్టి వస్తువును కవితా శైలిలో రచించడం అంత సులువైన పనేమీ కాదు— చాల అరుదు కూడ. మరొక ముఖ్య విషయం: తాను చెప్ప దలచుకున్న దానిని, మనలో ఒకడై మిత్రునివలె, తానును అదే విషయమును మనతో సమముగ గ్రహించు చున్నటుల కనిపిస్తూ, ఒక విశిష్టమైన పద్ధతిలో బోధిస్తాడు. యిట్టి మహత్తరమగు వస్తువును సరాసరి మన హృదయములలోనికి పంప వలెననిన యిట్టిఆత్మీయమైన బోధనా విధానము ఎంతైనా అవసరము. ఎదుటి వారల కంటె తానెంతో ఎత్తుగ నున్నట్లు, తాను చెప్పుటకు యితరులు వినుటకు మాత్రమేనన్నట్లు భావించు గురువుల వంటి వాడుకాడు జిబ్రాన్. తన కొరకూ, తన చుట్టూ కనిపెట్టుకొని యున్న వారలకూ మాత్రమే కాక మానవ జాతి కంతటికిని అమృతము పంచి పెట్ట వలెనని యాతని కాంక్ష.

ఇచ్చటనొక విషయము ప్రస్తావింపక తప్పుటలేదు: సృష్ట్యాది నేటివరకు ఎందరో మహానుభావులు వారు దర్శించిన సత్యమును మనకంద జేసిరి. ఖలీల్ జిబ్రాన్ యు వారిలో నొకడు. కాని వారందరు దర్శించిన

సత్యమొకే విధముగ లేదు. కొన్ని సందర్భముల యందు వారందజేసిన సందేశములు పరస్పరము భిన్నములే కాక విరుద్ధములుగ నుండుటయు కలదు. ఇందెవ్వరును కాదన దగినవారు కారు. కాని సత్యమొక్కటే గదా. అనగా వీరిలో నెవ్వరునూ పరిపూర్ణ సత్యమును దర్శించిన వారు లేరు. ఎవరు దర్శించిన సత్య పార్శ్వమునే వారు సత్యమనుచున్నారు. పరిపూర్ణ సత్యమును దర్శించుటకు మానవుడు పరిపూర్ణుడు కావలెను. అనగా శాశ్వతుడు గావలయును. ఇది అసంభవమని కొట్టి పారవేయ నవసరము లేదు. ఇట్టి కాంక్ష, సృష్ట్యాది ప్రతి జీవి యందును అంతర్లీనమై యుండును. మానవుడవతరించు వరకు, ఇట్టి కాంక్ష తనలో నుండి తనను పరిణమింప చేయుచున్నదన్న విషయము ఏజీవికిని తెలియదు. అట్లు తెలిసి కొనుటకు తగిన సాధన సంపత్తి వాని యందు విరియ లేదు. నేడు తనను, తన పరిసరములను సూక్ష్మాతి సూక్ష్మముగ తెల్సుకొన గల్గిన మానవుడు శాశ్వతత్త్వమునకై కాంక్షించినచో పరిణామ మాదిశకే కొనసాగును. దానికనువైన కృషి ఆధ్యాత్మికవైజ్ఞానిక రంగము లందు జరుగుచునే యున్నది గదా!

"మహాదార్శనికుడు" చదివిన తర్వాత, ఖలీల్ జిబ్రాన్ భావములను జాగ్రత్తగా పరిశీలించినచో, ఆతడు నేడుండిన ఇట్టి ఊహలనే చేయుననియు, శాశ్వత మానవుని దర్శింప గలిగి యుండుననియు అనిపించును.

* * *

ఏదేని ఒక ప్రక్రియ యందు రచయితలకు ప్రతిభ యుండుట సర్వ సాధారణము. ఒక వేళ ఒకటికి మించిన ప్రక్రియల యందు ప్రవేశ మున్నను అన్నింటి యందు ప్రతిభ యుండుట, అందునను సమాన ప్రతిభ చూపగల్గుట చాల అరుదు. స్వతంత్ర రచన చేయుట యందు ఎంత ప్రజ్ఞావంతులో అనువదించుట యందు అంతటి ప్రజ్ఞను కలిగి యుండుట విశేషమే యగును. ఒక్కొక్క అనువాద గ్రంథమును చదివిన— మూలముతో నింక పని ఏమి? అనిపించును. అట్లుండుటకు కారణము లనేకములు.

అనువాదకుడు తనకు నచ్చని గ్రంథమును, అనగా అందలి భావముల యందు ఆదరాభిమానములు, ఆ రచయిత యెడల గౌరవభావము కలిగి యుండని యెడల అట్టి అనువాదము నిర్జీవముగ "మెకానికల్"గ నుండును. మరియొక ముఖ్య విషయము: ఒకే అనువాదకుడు ఒకని సంపూర్ణ సాహిత్యమును అనువదించుట చాల అవసరము. అట్టి అనువాద గ్రంథములు చదువ హాయిగ నుండును. గ్రంధ రచయితకు, గ్రంథమునకు న్యాయము చేకూరుటయే కాక, అనువాదకునికి గ్రంథ కర్తతోడి సన్నిహితత్త్వము దిన దినప్రవర్ధమాన మగుటతో, అనువదించుట నల్లేరుపై బండి నడక యగును. ఇక, స్వేచ్ఛానువాదమని, మరి ఏవేవో పేర్లు పెట్టుకొని మూల గ్రంథము నందలి విషయముల మార్చు చుందురు. అట్టి మార్పుల వలన, గ్రంధ కర్త యొక్క దేశకాల పరిస్థితులు, సంస్కృతి నాగరకత మొదలగునవి అనువాదము నందు ప్రతి బింబింపక పోయినచో అంతకుమించి రచయితకు జరగ వలసిన అన్యాయము మరొకటి ఉండదు. ఇక, ప్రపంచమందలి మానవులందరూ ఏక కుటుంబీకులుగా మెలగ వలెనను ఉత్సాహము దేశ దేశములందలి ప్రజలలో నురకలు వేయు సమయమున అనువాద సాహిత్య ఆవశ్యకత ఎట్టిదో వేరుగ చెప్ప నవసరమేమున్నది!

మిత్రులు ఆచార్య ధనకుధరం ఇప్పటికే ఖలీల్ జిబ్రాన్ రచనల నెన్నో అనువదించిరి జిబ్రాన్ సాహిత్యము నంతయు అనువదింప వారు సమకట్టుట, యిచట పేర్కొన దగిన ముఖ్యాంశములలో నొకటి. తాను కవియగుట చేతను, జిబ్రాన్ భావముల యందత్యంత అభిమానము కలిగియుండుట చేతను వీరి అనువాదమును కడు రమ్యముగ నున్నదనుటలో ఎట్టి అతిశయోక్తియు లేదు. ఒక్క మాటలో చెప్పవలెనన్న "ప్రాఫెట్" చదువుటకు బదులు "మహాదార్శనికుడు" చదివినను చాలనిపించును. "మహాదార్శనికుడు" మనదగ్గరనున్న, "ప్రాఫెట్" లేదన్న కొరత యుండదనిపించును.

ఎ. వి. శర్మ



ఆల్ ముస్తఫా భగవదనుగ్రహపాత్రుడు. పరమేశ్వర నిరతిశయ కరుణామృత వర్షితుడు. ఆనాటి గాఢాంధ తమస్వినికి అతడొక ఉషస్సు. తానుపుట్టిన ద్వీపానికి తరలించు కొనిపోయే నౌకాగమనానికి పన్నెండేళ్ళనుంచీ 'అర్ఫలెస్' నగరంలో పడికాపులు కాస్తున్నాడు.

పన్నెండో సంవత్సరంలో పంటకళ్ళాల నూర్పిడిసాగే 'ఇయెలూల్' నెలలో ఏడోనాడు, పట్టణప్రాకారాలకు వెలుపల ఉన్న పర్వతం ఎక్కి, సాగరంమీదికి దృష్టిసారించాడు. మంచుముసుగులో వస్తున్న తననౌకను పసిగట్టాడు. అంతటితో అతడి హృదయద్వారాలు భళ్లున తెరుచుకున్నవి. అతని ఆనందం రెక్కలువిప్పుకుని, ఆ సాగరోత్తుంగ తరంగ తురంగా లతోబాటు ఆకాశంలో నాట్యమాడింది. కళ్ళుమూసుకున్నాడు. దైవధ్యాన నిమగ్నుడైనాడు.

కానీ, అతడు కొండదిగివస్తున్నప్పుడు, అతనిమనస్సుపై ఒక విషాదచ్ఛాయ అలుముకుంది. అప్పుడిట్లా అనుకున్నాడు తనలో.

శోకావిలంకాని సుప్రసన్న చిత్తంతో యిక్కడనుంచి పోవడం నా తరమా? ఆత్మలో గాయంలేకుండా ఆవలీ నగ రాన్ని వదలివెళ్ళడం సాధ్యమయ్యే విషయమేనా?

ఎన్ని బాధామయసనాలీ పట్టణప్రాకారంలో గడపానో? ఎన్ని ఏకాంత నిశాసమయాలు దొర్లుకుపోయినవో! తనపడ్డ బాధనుంచీ, తానసుభవించిన ఏకాంతతనుంచీ, నిర్విచారంగా దూరంకాగలవాడెవడు?

ఈ నగరవీధుల్లో నా హృదయశకలాలనేకం విర జిమ్మాను. నా అభీష్టానుగుణులైన బాలురెందరో ఈ కొండ కోనల్లో సర్వనగ్నంగా సంచరించారు. హృదయభారం, మనో వేదనా లేకుండా వీళ్ళనుంచి విడిపోలేను.

ఈనాడు నేను తీసిపారవేస్తున్నది కేవలం నాపరిధానం కాదు. నాచర్మాన్నే, నా చేతులతో ఒలిచివేసుకోబోతున్నాను.

కాక, నేనిక్కడ కేవలం ఒక కల్పనను మాత్రమే నిల్పి పోతున్నానా? ఆకలిదప్పులతో అమృతమయమైన హృద యాన్నే వదలిపెట్టి పోతున్నాను.

ఏమైనా నేనిక్కడ ఎక్కువకాలం తటపటాయించలేను. సర్వాన్నీ తనలోకి స్వాగతంపలికే సాగరుడు, నాకూ స్వాగతా హ్వానాన్ని సంసిద్ధపరచాడు. నౌకాయాన సంచారానికి నడుంగట్టవలసించే నేను.

ఇక్కడనే ఉండిపోవడమంటే, నిశాసమయాలు నిరం తరంగా నిర్దగ్ధమౌతున్నా ఘనీభవించి, గ్రావమై లోహప్రతిమగా రూపొందడమన్నమాట !

ఇక్కడున్నదంతా మహానందంగా వెంట తీసుకెళ్ళు తాను మరి, ఎట్లా పట్టుకుపోతాను?

వాక్కు తనకు రెక్కలుకట్టిన నాలుకను, పెదవులను, తానై మోయగలదా? ఈ విశాల విశ్వాంతరాళంతో అది, తాను గానే విహరించాలి.

ఖగరాజు తన కులాలయాన్ని వదలి తానొక్కడేగదా గగనాంగణ విహారం చేస్తాడు!

ఇట్లా అనుకుంటూ అతడు పర్వత పాదమూలానికి చేరాడు. మళ్ళీ సముద్రం దిక్కుగా మరలిచూచాడు. తననౌక, రేవును సమీపిస్తుండటం గమనించాడు. దాని ఉపరిభాగంలో ఉన్న స్వదేశీయ నావికులను అవలోకించాడు.

అప్పుడాతని అంతరాత్మ వారికై గొంతువిప్పుకుంది.

మామకీన ప్రాచీన మాతృసంతానమా! తరంగ తురంగ సంచారులారా!

నా స్వప్నసాగరంలో మాటిమాటికీ ప్రయాణించిన మీరు ఇప్పుడు నా ప్రగాఢస్వప్నమైన నా మెలుకువలోకి వచ్చారు! నేనూ ప్రయాణానికి సిద్ధంగాఉన్నాను. ఎత్తిన తెరచాపల్లాంటి నా తహతహ గాలివాటుకు కనిపెట్టుకుని ఉంది!

ఈ నిశ్చల వాయుపథంలో ఇంకొక ఊపిరిమాత్రమే పీలుస్తాను. వెనుకకు మరొక అనురాగవీక్షణం మాత్రమే

ప్రసరిస్తాను. ఇక అంతటితో సాగరయాత్రికులైన వీిమధ్యలో నేనూ ఒక సాగరయాత్రికునిగా నిలబడుతాను.

ఓ నిద్రాముద్రిత విశాల సముద్రజననీ! నిండారు నదికీ, కొండవాగుకూ, నీవే శాంతిప్రదాయినివి! నీవే స్వేచ్ఛాప్రదాత్రివి!

ఈ వాహిని ఇంకొక్క మలుపు మాత్రమే తిరుగుతుంది. ఈ తరులతాగుల్మ గహనమార్గంలో ఇంకొకేఒక కూనిరాగం ఆలపిస్తుంది. అంతటిలో అనంతసాగరమైన నీలోకి అనంతజల బిందువుగా సంగమిస్తాను.

అతడిట్లా అనుకుంటూ అడుగులు వేసుకుంటూ పని చేస్తున్న పొలాలు, ద్రాక్షోద్యానాలు విడిచి, వడివడిగా పట్టణ ప్రముఖ ద్వారందగ్గరకు వస్తున్న నరనారీబృందాన్ని గమనించాడు. వాళ్ళు తనపేరు పలకడం ఆలకించాడు. వస్తున్న నౌకను గురించి చేలల్లో ఒకళ్ళకొకళ్లు పొలికేకలతో చెప్పుకోవడం విన్నాడు.

తనలో ఇట్లా అనుకున్నాడు.

వియోగదినమే సంయోగదినమవుతుందా? నా జీవిత సాయం సమంయాన్నే, మరి, నిజానికి నా ఉషస్సమయంగానూ సంభావింపవచ్చునా ?

నాకై, తన నాగలిని సగం చాలులోనే వదలివచ్చిన రైతుకూ, ద్రాక్షాసవ యంత్రాన్ని అర్ధాంతరంగానే ఆపివచ్చిన కార్మికుడికీ నేనేమి ఇస్తాను ?

నా హృదయం విరగబండిన ఫలవృక్షమైతే, అన్నికోసి ఈ అందరికీ అందింపగలిగేవాడిని! నా కోరికలు జలపడి పెల్లుబికివస్తే, వాళ్ళ పానపాత్రలు నింపగలిగేవాడిని!

నేను, ఆ సర్వశక్తిమంతుని హస్తస్పర్శను పొందే వీణాదండాన్నా? లేక ఆయన ప్రాణానిలాన్ని నాలో ప్రసరింప చేసుకునే వేణువునా ?

నేను, ప్రశాంతాన్వేషకుడిని; నా ప్రశాంతాన్వేషణలో, ఆత్మవిశ్వాసంతో వీళ్ళకు అందించగల ఏ నిధినిక్షేపాలు కనుక్కున్నాను ?

ఇదే, నా పంట కోతదినమైతే, నాకు గుర్తుతగలని ఏ ఋతువుల్లో, ఏ క్షేత్రాలలో బీజావాపంచేశాను?

వాస్తవానికి ఇది, నా దీపాన్ని పైకెత్తి పట్టుకునే సమయమే ఐతే, ఇందులో వెలిగేది నా కాంతిమటుకు కాదు.

నూనెలేని వెలుగులేని నా దీపాన్ని పైకెత్తుతాను. నిశాపోషకుడే దీన్ని, నూనెతో నింపుతాడు; వెలిగిస్తాడు.

ఇవీ ఆతడన్న మాటలు! కానీ, అనకుండా ఉన్నదెంతో అతడి హృదయంలోనే ఉండిపోయింది; తనలో ఉన్న నిగూఢ రహస్యాన్ని తానుగా చెప్పలేడు కాబట్టి.

ఆటు తర్వాత అతడు నగరంలోకి అడుగుపెట్టేటప్పటికి అందరూ ఏకకంఠంగా ఆహ్వానిస్తున్నారు.

పౌరవృద్ధులు, ముందువరుసలో నిలబడి ఇట్లాఅన్నారు: 'మా మసకచీకటి జీవితానికి మట్టమధ్యాహ్నంగా భాసిస్తు న్నావు. మరి నీ తారుణ్యం మాకు స్వప్నాలు కల్పించింది. నీవు మాకు అపరిచితుడవు కావు; అతిథివీ కావు; మా బిడ్డవు; మాకు ఆప్తుడవు; మా కళ్లు, నీ వదనంకోసం కాయలు కాచేలా చేయకు అప్పుడే!'

అప్పుడు ఆయనతో అర్చకులు అర్చకురాండ్రు ఇట్లాఅన్నారు. ఇప్పుడీ సాగరతరంగాలు మనలను విడదీయడానికి వీలులేదు. ఇక్కడ మీరుగడపిన ఇన్ని సంవత్సరాలు, ఇకమీదట కేవలం ఒక స్మృతిప్రాయంగానే ఉండరాదు. మా మధ్యలో ఒకఆత్మగా సంచరించారు. మీ నీడ మా వదనాలకొక వెలుగుగా ప్రతిభా సిస్తున్నది. మేము మిమ్మల్నెంతగానో ప్రేమించాము. కానీ, ఆ మా ప్రేమ ఇప్పటిదాకా మూగతనంముసుగులోనే ముడుచు కుని ఉంది!

ఇప్పుడు మిమ్మల్ని గొంతెత్తి పిలుస్తున్నది మీ ఎదుట నిజరూపంతో నిలిచింది.

ఎడబాటు ఘడియ తారసిల్లేవరకూ ప్రేమకు తనలోతు తనకే తెలియదు!

ఇట్లాగే తక్కినవాళ్ళూ వచ్చి అతడిని సాంజలిబంధంగా అభ్యర్థించారు. కానీ, అతడు, వాళ్ళకెవళ్ళకూ ప్రతివచనం పలుకలేదు. అవనతవదనుడై నిలబడ్డాడు. అతనికి సమీపంలో నిలబడ్డవాళ్లు, అతడి హృదయంమీద జారిపడుతున్న కన్నీటిని గమనించారు.

ఆ తర్వాత, అతడూ ఆ పౌరులూ కలిసి, దేవాలయం ముందున్న మహాచతురంగణం వేపుగా సాగారు.

అక్కడి దేవాలయంలోనుండి, 'అల్ మిత్రా' అనే ఆమె బైటకు వచ్చింది. ఆమె ఒక తపస్విని.

అతడామెను అమితార్ద్రహృదయంతో అవలోకించాడు. ఒకప్పుడాతడు వాళ్ళనగరంలో ఒకరోజుమాత్రమే ఉన్నప్పుడు ఓంప్రథమంగా, అతడిని ఆశ్రయించి, అత్యంత శ్రద్ధాసక్తులు ప్రదర్శించిన వ్యక్తి ఆమె. ఆమె అతడిని ఇలా అభినందించింది. 'ఓ మహోదార్యనికా! అత్యుత్తమతా సంసిద్ధి నపేక్షించి, మీ నౌకకోసమని చిరంగా దూరదూరాలు పర్యవేక్షించారు. మరి, నేటికి, ఆ, మీ నౌక వచ్చింది. ఇక మీ పోక తప్పదు.

మీ జ్ఞాపకాల కాపురం, మీ మహత్తరాకాంక్షలకు నివాసమైన మీ భూభాగానికి చేరాలని మీ గాఢాభిలాష. మరి, మాకు, మీమీద ఉన్న, అనురాగం గానీ, మాకు మీతోఉన్న అవసరాలుగానీ మిమ్ము పోకుండా నిర్బంధ పెట్టడం సముచితంకాదు.

ఐనా, మా అందరినీ వదలిపోయేముందు, మిమ్మొకటి అభ్యర్థిస్తున్నాము. మీరు దర్శించిన సత్యాన్ని, మనసు విప్పి, మాకు చెప్పండి! ఆ, మీ, మహాదర్శనాన్ని మేము, మా పిల్లల వరుసగా, తరతరాలుగా అనుశ్రుతం చేసుకుంటాము. అంతటితో అది, అక్షయమౌతుంది.

మి ఐకాంతికంలో, మా జీవితక్షణాలను గమనించారు. మీ మెలుకువలో మా నిద్రలోని ఏడుపునూ, నవ్వునూ, జాగ్రత్తగా గమనించారు.

మమ్మల్ని, మాకు ఎఱుకపరచండి! బ్రతుకు చావుల మధ్య మీరు గ్రహించిన, ఆ పరమ సత్యాన్ని మా అందరికీ వినిపించండి."

అప్పుడతడు పెదవి కదలించాడు : "ఆర్ఫలెస్ పౌరులారా! ఇప్పటికీ, మీ అంతరాత్మల్లో స్పందిస్తున్న విషయం తప్ప, నేను మాత్రం, ఇతరంగా మీకు చెప్పగలిగిందేమున్నది?"

**అప్పుడు అల్మిత్రా "ప్రేమ"ను విశదీకరించండి! అని అర్థించింది.**

అతడు తన తలపైకెత్తి, అక్కడ గుమిగూడిన ప్రజలందరినీ ఒక్కసారి పర్యవేక్షించాడు. అందరూ శ్రవణాసక్త నిశ్చల ప్రసన్న చిత్తులై కనిపించారు. అప్పుడుపక్రమించాడు. ధీరగంభీరంగా :

ప్రేమ, నిన్ను తనవెంట రమ్మని సూచిస్తే, దాని మార్గాలు కఠినాలు, గహనాలైనా తప్పక అనుసరించు!

అది; నిన్ను, తన రెక్కలక్రింద పొదువుకుంటే, ఆ రెక్కలమాటున నక్కికున్న ఖడ్గం నిన్నొకవేళ గాయపరచినా, నీవుమాత్రం అక్కడనే ఒదుకో!

అది, నీతో మాట్లాడినపుడు ఉత్తరపుగాలి, ఉద్యానాలను ఊడ్చిపెట్టే రీతిగా, దాని కంఠస్వరం, ఒకవేళ నీ తీయని కలలను చిందరవందర చేసినా, నీవు మాత్రం దానినే విశ్వసించు!

ప్రేమ; నిన్ను, మహా మకుటాభిషిక్తుణ్ణి చేసినట్లుగానే, ఉరికంబానికీ ఎక్కిస్తుంది. నీ పెంపుకు దోహదం చేసినట్లుగానే, నిన్ను, అంటుకత్తెరగూడా వేస్తుంది.

అది; నీ అంత ఎత్తు ఎదిగి, సూర్యకాంతిలో సుకుమారాలు పోయే నీ నును లేత కొమ్మలనూ, రెమ్మలనూ, ఆప్యాయంగా నిమిరినట్లే, నీ వ్రేళ్ళుపాకిన లోతులవరకూ పోయి, భూమికి అంటిపెట్టుకున్న వాటిని గూడా పెరికి పారవేస్తుంది!

అది; ధాన్యపు పనలను చేర్చుకున్నట్లుగా, నిన్ను, తన దగ్గరకు చేర్చుకుంటుంది.

నూర్పిడి చేసి నీ ఆవరణను తొలగిస్తుంది.

జల్లెడపట్టి, నీ పొట్టు నెట్టేస్తుంది!

మరపట్టి, నీకు మంచి తెల్లదనం కల్పిస్తుంది.

పిండిపట్టించి, తడిపి పాకంవచ్చేదాకా నిన్ను పిసికి ముద్ద చేస్తుంది. అప్పుడు, తన దివ్యాగ్ని దగ్గరకు పట్టుకు పోయి, భగవన్నైవేద్యానికి పనికివచ్చే పవిత్రపు రొట్టెగా కాల్చి, సిద్ధంచేస్తుంది, నిన్ను.

నీ హృదయంలోని రహస్యాలను నీవే స్వయంగా తెలుసుకుని, ఆ విజ్ఞానంతో నీవొక జీవితశకలంగా సంసిద్ధం కావడంకోసం, ఇన్ని దశలు ఆకల్పిస్తుంది నీకు, ప్రేమ.

కానీ, నీకున్న భయంకొద్దీ నీవు కేవలం ప్రేమలోని శాంతినీ, ఆనందాన్ని మాత్రమే అభిలషిస్తావు.

అట్లాగైతే, నీ నగ్న రూపాన్ని కప్పిపుచ్చుకుని, ప్రేమ యొక్క పంటకళ్ళంనుంచి, హృదయం ప్రిదిలేటట్లుగా ఆనందించడానికిగానీ, ఆక్రోశించడానికి గానీ అవకాశం లేని కాలవిభాగంలేని ఆ లోకానికి పారిపోయి ఏదోగా నవ్వుకో! ఏదోగా ఏడ్చుకో!

దాత, ప్రతిగ్రహీతలు రెండూ, ప్రేమే!

దానికి, తనదంటూ లేదు; తానెవరిదీ కాదు!

ప్రేమకు, ప్రేమే చాలు!

నీవు ప్రేమిస్తున్నప్పుడు 'నా హృదయంలో భగవంతుడున్నా'' డనికాక ''నేను భగవంతుని హృదయంలో ఉన్నాను!'' అని మాత్రమే అను!

ప్రేమకు మార్గదర్శకత్వం వహించగలనని తలపోయకు. నీవు అర్హుడవని భావిస్తే, అదేనీకు మార్గదర్శకత్వం వహిస్తుంది. తననుతాను నిర్వహించుకోవడం కంటె, ప్రేమకు మరొక కామన లేదు. ఐనా, నీవు, ప్రేమిస్తే, నీకు తప్పనిసరి కోరికలుంటూ ఉంటే, నిశాదేవికి తన మధుర సంగీతం వినదిస్తూ, జలజలా సాగిపోయే సెలయేటిగా కరిగి పోవాలని కాంక్షించు!

అమిత వాత్సల్య ప్రతిఫలంగా అనుభవించే బాధను, అర్థం చేసుకోవాలని ఆకాంక్షించు!

ప్రేమను స్వయంగా అర్థంచేసుకున్నందుకు గాయ పడడానికి ఆయత్తపడు!

మనసార, మహానందంగా రక్తతర్పణం చేయాలని మనసుపడు! ఉషోదయంతో బాటు రెక్కలుకట్టుకున్న హృద యంతో మేల్కొని, ప్రేమాస్పదమైన మరొక ప్రభాతానికి, అభి వందన లర్పించాలని అభిలషించు!

మధ్యాహ్న సమయంలో విశ్రాంతి తీసుకుని, ప్రేమ లోని అలౌకికతను ధ్యానించాలని ఆసక్తిపడు!

కృతజ్ఞతతో సాయంకాలానికి ఇంటికి తిరిగి వచ్చి, నీ హృదయంలో ఉన్న ప్రేమ మూర్తికి ప్రార్థనలు పలికి, పెదవు లపై అభినందన గీతిక ఆలపిస్తూ నిద్రించాలని అనుతపించు!



## అప్పుడు, అల్‌మిత్రా మళ్ళీ అడిగింది :
## ఆచార్యా! "వివాహం" విషయమేమో మరి?

అతడు సమాధానించాడు :

మీరు జంటగా జన్మించారు: ఇంకా ఎప్పటికీ జంటగానే ఉండాలి! మృత్యుదేవత తెల్లని రెక్కలు, మీ జీవితాహస్సులను చెదరగొట్టేంతవరకూ, మీరు, జంటగానే ఉండాలి!

అంతే కాదు; భగవంతుని మౌనస్మృతిలో గూడా మీరు జంటగానే ఉంటారు!

ఐనా, మీ కలసికట్టుతనంలో కొన్ని ఖాళీలు ఉంచుకోండి!

నభోమారుతాలను మీ మధ్య నాట్యమాడనీయండి! పరస్పరం ప్రేమించుకోండి! కానీ ప్రేమబంధం కల్పించుకోకండి! దానిని, మీ అంతరాత్మల తీరాల మధ్య సంచరించే సముద్రంగా ఉండనీయండి! పరస్పరంగా పానపాత్రలు నింపుకోండి! కానీ, ఒకే పాత్రనుంచి పానం చేయకండి!

౹ా రొట్టె ఒకళ్ళకొకళ్ళు ఇచ్చుకోండి; కానీ, ఒకే
చిమాత్రం తినకండి; ఉభయులూ కలిసి పాడండి;
ఆనందించండి; ఐనా! వీణా తంత్రులు వేటికవే విడి
ర్నా, అన్నీ కలిసి ఒకే సంగీతాన్ని నినదించినట్లు,
వరికి వారుగనే ఉండండి.

ా హృదయాలు అందించుకోండి ; కానీ, ఒకళ్లు
అధీనంలో ఉంచుకోకండి; ఎందుకంటే, ఒక్క జీవిత
హస్తం మాత్రమే మీ హృదయాలను భరించగలదు.

కలిసి నిలవండి! ఐనా, మరింత కదియనొక్కకుని
నిలవకండి!

దేవాలయస్తంభాలు దేనికది విడివిడిగా నే ఉంటువిగదా!

ఓకుచెట్టూ, సైప్రస్ చెట్టూ, ఒకదాని నీడలో ఒకటి
పెరుగవు.



అప్పుడు పసిబిడ్డను వక్షోజానికి హత్తుకున్న ఒక పడతి "పిల్లలను గురించి" చెప్పండి అన్నది.

అతడు సమాధానించాడు :

మీ పిల్లలు మీ పిల్లలు కారు.

వాళ్లు, స్వీయార్థమైన జీవితాభిలాషకు పుత్రులు, పుత్రికలు.

వాళ్ళు మీ ద్వారా వచ్చారుగాని, మీ నుంచి రాలేదు.

వాళ్ళు మీతోబాటే ఉంటున్నా, మీకు మాత్రం చెందరు.

వాళ్ళకు, వాళ్ళ సొంత ఆలోచన లున్నవి.

వాళ్ళ దేహాలకు మీరు ఆశ్రయం కల్పించ వచ్చు గాని, వాళ్ళ ఆత్మలకు కల్పించలేరు.

వాళ్ళ ఆత్మలు, మీరు కనీసం కలల్లోనైనా కాలుపెట్టలేని రేపనే ఇంట్లో కాపురం ఉంటవి.

వాళ్ళ వలె ఉండటానికి మీరు ప్రయత్నపడ వచ్చు.

వాళ్ళను మాత్రం మీ మాదిరి చేయడానికి చూడవద్దు.

జీవితం తిరోగమనం చేయదు, నిన్నటితో తాబేలు నడక నడవదు.

సజీవ శరాలవంటి మీ పిల్లలను ముందుకు దూకించే శరాసనాలు మీరు.

ఆ మహా ధానుష్కుడు, అనంతపథంలో లక్ష్యాన్ని గమనించి, తనశరాలు దూరాలకు వేగంగా దూసుకు పోవడానికి, మిమ్ములను బలంకొద్దీ వంచుతాడు. ఆ కోదండ కళాప్రవీణుడి హస్తంలో ఆనందంగా ఆనమితులు కండి! ఆయన, దూసుకుపోయే బాణాన్నీ, తొలగని వింటిని సమానంగానే ప్రేమిస్తాడు.



అప్పుడొక సంపన్నుడు "ఇవ్వడం" మీద పలకండి! అన్నాడు.

అతడు సమాధానించాడు :

నీకున్న ఆస్తి పాస్తులన్నీ ఇచ్చివేసినా కొద్దిగానే ఇచ్చావని అర్థం.

నిన్ను, నీవు ఇచ్చుకున్ననాడె నిజంగా ఇవ్వగలిగిన వాడ వవుతావు.

ఇంతకూ నీ ఆస్తి పాస్తులంటే అర్థం?

రేపటికి కావలిసి వస్తుందేమోనని తహ తహ కొద్దీ, అతిజాగ్రత్తగా అట్టిపెట్టుకునే వస్తుసముదాయమే గదా!

ఇక రేపటి విషయం?

గుర్తుపట్టడానికి ఆస్కారంలేని ఇసుకతిప్పలో బొమికలు దాచుకుని, తీర్థ యాత్రికులతో పుణ్యక్షేత్రానికి పోయే "అతి తెలివి" గల కుక్కకు, రేపువలన ఒరిగిపడేదేముంది? నీ బావి నిండా నీళ్ళున్నా, దప్పికపైన భయంగదా, నీకు ఆరనిదాహం ఆకల్పిస్తున్నది? ఇకపోతే తమకున్న చాలా మొత్తంలోనుంచి కొద్దిగా మాత్రమే ఇచ్చేవాళ్ళున్నారు. జీవితం మీదా, జీవితా దార్యం మీదా శ్రద్ధాశక్తులుగలవాళ్ళు వీళ్ళు.

వీళ్ళ కోశాగారం ఎన్నటికీ క్షీణించదు.

ఆనందంగా ఇచ్చే వాళ్ళున్నారు! ఆ ఆనందమే వాళ్ళకుచెందే బహుమానం! బాధపడుతూ ఇచ్చే వాళ్లున్నారు ఆ బాధే వాళ్ళకు సంస్నపనము! ఇక, ఇవ్వడంలో బాధ అంటే ఏమిటో తెలియకుండా, ఆనందంకోసం ఆరాటపడ కుండా, తాము చేస్తున్నదొక సత్కార్యం అనే ఎఱుకగూడా లేకుండా ఇచ్చేవాళ్ళున్నారు. వాళ్ళు, దూరంగా కొండ కోనల్లో విరబూసిన సన్నజాజి, తనపరిమళం విశాలాంతరాళం లోకి విరజిమ్ముతున్నట్లుగా ఇచ్చేస్తారు.

ఇటువంటి వాళ్ళ హస్తాలనుంచే భగవంతు డభిభా షిస్తాడు.

వీళ్ల కళ్లల్లో నుంచే ఆయన తన మందహాసకాంతులు వసుధాతలంలో ప్రసరిస్తాడు.

అడిగి నప్పుడివ్వడం మంచిదే.

కానీ, అర్థంచేసుకుని, అడక్కముందే ఇవ్వడం మరింత మంచిది.

ఇచ్చినప్పటికన్నా, అసలు పుచ్చుకునే వాడికోసం అన్వేషించడంలోనే, దానకర్ణుడికి అధికానందం ఉంది.

ఇవ్వకుండా అట్టిపెట్టుకునే దేమైనా ఉందానీకు?

ఏదో ఒకనాడు నీకున్నదంతా ఇచ్చేయాలిసిందే!

అందుకనే, ఇచ్చేఅవకాశం నీ వారసులకు దక్కనీయకుండా, ఇప్పుడే నీవు దక్కించుకో!

"నేను ఇస్తానుగానీ, అర్హులకు మాత్రమే ఇస్తాను" అని అంటుంటావు ఎక్కువగా.

నీ ఉద్యానవనంలో ఉన్నఫలవృక్షాలు గానీ, నీ పచ్చిక బీళ్లల్లో మేసే పశుబృందంగానీ అట్లా అనదు.

అవి, తాము బ్రతకడం కోసం ఇస్తవి.

అట్టి పెట్టుకోవడం అంటే గిట్టిపోవడమే!

తన జీవితంలోని అహర్నిశలను అనుభవించాడానికి అర్హుడైనవాడు నీ దగ్గర ప్రతిదీ అనుభవించడానికి అర్హుడే!

జీవిత పాధోధి నుంచి పానం చేయడానికి అర్హుడైన వాడు, నీ చిన్న సెలయేటి నుంచీ తన పాత్రను నింపుకోవడానికి అర్హుడే!

ప్రతిగ్రహించగల ధైర్యం, ఆత్మ విశ్వాసం, ఔదార్యం కలిగి ఉండడంకన్నా, మించిన అర్హత ఇంకేమి కావాలి?

మానవుల అర్హతనూ, అహాన్ని సర్వనగ్నంగా, నిరాచ్ఛాదితంగా చూడటంకోసం, వాళ్లను గుండెలు చీల్చుకుని, అహం మీదముసుగు తొలగించుకుని, నీయెదుట నిలబడాలని అనడానికి నీవెవడివని?

అసలు నీవు ఇవ్వగలవాడిగా అర్హుడవో కాదో, ఇవ్వడంలో నిమిత్తమాత్రుడవో కాదో, ముందు నిర్ధారణ చేసికో!

యథార్థంలో జీవితమే జీవితానికి ఇస్తుంది.

"నేను ఇస్తున్నాను" అనుకుంటున్న నీవు సాక్షి మాత్రుడవు.

ఇక తీసుకునే మీరు :

వాస్తవంలో మీరంతా ప్రతి గ్రహీతలే! మీరు ఏ విధంగానూ కృతజ్ఞతా భారం వహించకండి!

లేకపోతే మీరు మీ మెడల మీదనే గాకుండా, ఇచ్చినవాడి మెడమీద గూడా పెద్దకాడి మోపినవాళ్ళవుతారు.

అట్లాగాకుండా, ఆ దాతతో కలిసి, అతడి రెక్కల మీద మాదిరిగా అతడి దానాల మీద ఊర్ధ్వగమనం చేయండి!

ఎందుకంటే, నీ ఋణాన్ని గూర్చి నీవు అతిగా పట్టించుకున్నావంటే, ఉదారహృదయురాలైన ఉర్విని మాతగా, భగవంతుడిని పితగా భావించే వ్యక్తియొక్క మహౌదార్యాన్ని శంకించిన వాడవవుతావు.



అప్పుడు, వృద్ధ సత్రశాలాధిపతి,

"తినడం, త్రాగడం" గురించి చెప్పండి అన్నాడు.

అతడు సమాధానించాడు :

నీవు ధరాపరిమళాన్ని మాత్రమే ఆస్వాదిస్తూ బ్రతుక గలుగుతావా? లేక, గాలి మొక్క మాదిరిగా కేవలం సూర్య కాంతితో బ్రతికి బట్టగట్ట గలవా?

నీ భోజనానికని నీవు కొన్నిటిని అవశ్యంగా వధించాలి. నీ దాహం తీర్చుకుంటానికని, లేత దూడను తన తల్లిపాలు త్రాగకుండా చేసి, అవన్నీ నీవే హరించాలి. కాబట్టి ఇదంతా దైవార్చనగా భావించు.

మానవుడిలో వున్న నిర్మలతరము, సరళతరమైన ఆత్మార్థంగా, నిర్మలమూ, సరళమూఐన ఆరణ్యక శాద్వల సంబంధమైన వాటిని తెగటార్చే నీ వధ్యశిలను దైవార్చనా పీఠంగా ఉపయోగించు.

ఏదైనా ఒక జంతువును చంపినప్పుడు, నీ హృదయంలో దానితో ఇట్లా అను :

"నిన్ను చంపిన శక్తిచేతనే నేనూ వధింపబడుతాను. నేనూ దానిచేతనే నిర్ధగ్ధమౌతాను.

"ఏ న్యాయం నిన్ను నా చేతుల్లోకి అప్పగించిందో, ఆ న్యాయమే, నన్ను నాకన్నా బలవంతుడి చేతికి అప్పగిస్తుంది.

"నీ నెత్తురూ, నా నెత్తురూ కేవలం ఆ స్వర్గవృక్ష దోహదమైన జీవనసారం తప్ప, మరేమీ కాదు."

ఏదైనా ఒక పండును నీ పంటి క్రింద వేసి నొక్కినపుడు నీ హృదయంలో దానితో ఇట్లా అను :

"నీ బీజాలు నా శరీరంలో జీవిస్తవి.

"నీ రేపటిమొగ్గలు, నాహృదయంలో వికసిస్తవి.

"నీ సౌగంధ్యమే నా వూపిరి.

"మనమిద్దరం కలిసిఅన్ని ఋతువుల్లో ఆనందిస్తాము."

వసంతకాలంలో, నీ ద్రాక్షోద్యానాల్లో నుంచి, ద్రాక్ష పండ్లను కోసి, ద్రాక్షాసవయంత్రానికి సమకూరుస్తున్నప్పుడు, ఇట్లా అనుకో హృదయంలో :

"నేనూ ద్రాక్షోద్యానాన్నే.

"నా పండ్లూ ద్రాక్షాసవ యంత్రానికి సమకూర్చ బడుతవి. నవద్రాక్షాసవం మాదిరిగా నేనూ శాశ్వతపాత్రల్లో అట్టిపెట్ట బడుతాను."

చలికాలంలో ద్రాక్షాసవాన్ని స్వీకరించేటప్పుడు ప్రతి పాన పాత్రకు నీ హృదయంలో ఒక గీతి ఆలపించు!

మరి, ఆ గీతిలో చలికాలపురోజులకూ, ద్రాక్షోద్యానాలకూ, ద్రాక్షాసవయంత్రానికీ కృతజ్ఞతను పొదుగు!



అప్పుడొక కృషీవలుడు,

"కృషి"ని గురించి చెప్పండి అన్నాడు.

అతడిట్లా సమాధానించాడు :

మీరు, భూమితో, భూమిఅంతరాత్మతోబాటు సమ భావంతో సాగిపోయేందుకు కృషి సాగిస్తారు. సోమరిగా ఉండడమంటే, ఋతువులకు అపరిచితుడు కావడం. అనంతంలోకి గంభీరంగా సదర్పంగా శరణాగతి పొందడానికి సాగించే జీవిత మహాప్రస్థానయాత్రిక బృందంనుంచి ప్రక్కకు తప్పుకోవడం.

నీవు పనిచేస్తున్నప్పుడు, నీ హృదయంలోని కాలం గుసగుసలను మధుర సంగీతంగా మార్చి పలికించే మంచి పిల్లనగ్రోవి వవుతావు.

తక్కిన ప్రకృతి సర్వం, సమైక్య సామరస్యంతో గానం చేస్తున్నప్పుడు, మీలో ఎవళ్ళుమాత్రం కేవలం నోరులేని మౌనవంశీనాళంగా ఉంటారుగనుక!

కృషి శాపమనీ, పరిశ్రమించడం దురదృష్టఫలమనీ నిరంతరంగా మీకు కొందరు నూరిపోశారు.

మరి నేననేది ఇది :

నీవు కృషి చేస్తున్నావంటే, ధరాదేవి సుదూరస్వప్నంలో ఒక భాగాన్ని సఫలంచేస్తున్నావన్న మాట! ఆ స్వప్నం జన్మించినప్పుడే, దాన్ని సఫలీకృతం చేసే కర్తవ్యంకూడా నీకు విధింపబడింది.

పరిశ్రమ ద్వారా జీవితాన్ని ప్రేమించడమంటే, జీవిత నిగూఢ రహస్యంతో, నిత్యపరిచితంగా ఉండడం.

కానీ, మీ బాధలో మీరు, పుట్టుకను దుఃఖ భాజనంగా, దేహపోషణను ఫాలభాగంపై లిఖించిన శాప పంక్తులుగా భావిస్తే, ఆ శాపలిపిని మీ నుదుట గ్రమ్మిన స్వేదజలమే నామరూపాలు లేకుండా కడిగి వేస్తుందని, నేను దృఢంగా చెబుతున్నాను.

మీకు, చాలామంది, జీవితం అంధకార మయం అని కూడా చెప్పారు.

జీవితంతో విసిగి వేసారి పోయిన వాళ్ళు చెప్పిన సుభాషితాన్నే, మీరూ మీ విసగటలో ప్రతిధ్వనిస్తారు.

ఉత్సాహ శూన్యమైన జీవితం నిజానికి అంధకారమే అంటాను నేను.

విజ్ఞాన విహీనమైన ఉత్సాహం, అంధ ప్రాయమే.

కృషిలేని విజ్ఞానం, నిరర్ధకం.

ప్రేమ లేని కృషి, సర్వ శూన్యం.

ప్రేమతో కృషిచేస్తే, నీవు నీవుగా సంఘటితపడుతావు, అంతేగాదు, మీరు, మీరుగా పరస్పరంగా సంఘటితు లౌతారు; అనంతరం భగవంతుడితో సంఘటితులౌతారు.

మరి ప్రేమతో కృషి చేయడం అంటే, ఏమిటి?

అంటే, నీ అనురాగమూర్తి ధరించడం కోసమన్నట్లుగా, నీ హృదయ తంతులతో వస్త్రాన్ని నేయడం; అంటే, నీ అనురాగమూర్తి నివసించడం కోసమన్నట్లుగా, ప్రణయ పూర్వకంగా గృహనిర్మాణం చేయడం; అంటే, నీ ప్రణయ మూర్తి ఆ ఫలితాన్ని అనుభవించడం కోసమన్నట్లుగా ఆర్ద్ర హృదయంతో బీజావాపం చేసి ఆనందంతో పంటను కోయడం;

అంటే, నీవు తీర్చిదిద్దిన వాటన్నింటినీ, నీ ఆత్మా నిలంతో పూరించడం;

అంటే, ధన్యమరణం చెందిన వాళ్ళందరూ, నిన్ను వెన్నుకాచుకుని గమనిస్తున్నారని గ్రహించడం.

"భూమిని దున్నేవాడికన్నా, పాలరాతిపని చేస్తూ, అందులో తన ఆత్మమూర్తిని దర్శించే వాడే ఉదాత్తుడనీ,

"మనకు పాదరక్షలు చేసేవాడికన్నా, మానవ ప్రతి రూపంగా వస్త్రంమీద అమర్చడంకోసం, ఆ ఇంద్రధనుస్సు గ్రహించేవాడే ఘనుడనీ", నిద్రలో కలవరిస్తున్నట్లుగా, మీరు అంటుండడం, అనేక పర్యాయా లాలకించాను.

కానీ, నేను మాత్రం, నిద్రమత్తులో గాకుండా, మాధ్యాహ్నిక సర్వ జాగ్రద్దశలో పలుకుతున్నాను వినండి!

మందానిలుడు, చిన్న గడ్డిపోచతో కన్నా, ఆకాశాన్నంటేంత ఎత్తుగా పెరిగిన ఆ మహావృక్షంతో మరింత మధురంగా, మాట్లాడడు.

స్వీయానురాగంతో మలయానిలాన్ని మధుర గీతిగా మార్చగలవాడే మహాఘనుడు.

కృషి, సాలోక్యరూప ప్రేమ.

అనురాగం లేకుండా, కేవల అయిష్టతతో కృషి చేయడంకన్నా, దాన్ని వదిలేసి, దేవాలయగోపురం ముందు కూర్చుని, సంతోషంగా కృషి సాగించే వాళ్ళను అడుక్కుతినడం మేలు.

ఎందుకంటే, నీవు నిర్లక్ష్యంగా కాల్చే రొట్టె, ఎవడి ఆకలీ తీర్చలేని చేదురొట్టెగా సిద్ధమౌతుంది.

ద్రాక్షాసవ యంత్రాన్ని త్రిప్పేటప్పుడు, అ
గొణిగా వంటే, ఆ ఆసవంలో నీ సణుగు
జాలువారుతుంది.

నీవు, గంధర్వగానం చేస్తున్నా, ఆ గానా
ప్రేమించకపోతే, అహర్నిశల మధుర కంఠధ్వన
కించకుండా, మానవుడి చెవులకు ఆచ్ఛాదనం క
వన్నమాట.



అప్పుడొక ముగ్ధ,

"మోదఖేదాలు" వివరించండి అన్నది

అతడు సమాధానించాడు :

నీ మోదం, ముసుగు తొలగించిన నీ ఖేదమే!

నీ హాసం పెల్లుబికే ఆ నీ ఆత్మకూపం మాటి మాటికీ నీ కళ్ళతో నింపబడుతుంది.

మరో రకంగా ఎట్లా ఉండగలదు మరి?

నీ అస్థిత్వంలోకి ఖేదం ఎంతలోతుగా తొల్చుకుపోతుందో, నీవు అంత అధికంగా మోదాన్ని అట్టిపెట్టుకోగల్గుతావు.

నేడు, నీ ద్రాక్షాసవాన్ని వహిస్తున్న పాత్ర, ఆ నాడు కుమ్మరి ఆములో కాల్చబడినది కాదా? ఈ నాడు, నీ ఆత్మకు ఉపశాంతి కల్పిస్తున్న దారుఖండం, ఒకనాడు కత్తులతో తొలచిన దారుఖండం గాదా?

నీవు సంతోషంగా ఉన్నప్పుడు, నీహృదయం లోతుల్లోకి చూచుకో !

నీకు, ఖేదాన్ని కల్పించిందే మోదాన్ని కల్పిస్తున్న దని గ్రహిస్తావు!

నీవు ఖేదావిలుడ వైనప్పుడు, మళ్ళీ నీ హృదయంలోకి చూచుకో!

అప్పుడు వాస్తవంగా నీకు ఆనందంగా ఉన్న దాని కోసమే విలపిస్తున్నానని గ్రహిస్తావు. మీలో కొంత మంది, మోదం ఖేదంకన్నా మిన్న అనీ, మరికొందరు, అదికాదు ఖేదమే మిన్న, అనీ అంటారు.

కానీ, నేననేదేమంటే, అవి రెండు కలిసివస్తవి. అందులో ఒకటి, ఒంటరిగానే నీసమ్ముఖంలో తిష్ఠవేస్తుంది. మరొకటి నీ శయ్యమీదనే నిద్ర పోతున్నదన్న విషయం జ్ఞాపకం పెట్టుకో!

మీరు, మీ మోదఖేదాల మధ్య త్రాను ముల్లుమాదిరిగా ఊగిసలాడుతుంటారు.

మీరు, సర్వశూన్యంగా ఉన్నప్పుడు మాత్రమే నిశ్చలంగా సుస్థిరంగా ఉంటారు.

ఆ కోశాధికారి, తన బంగారాన్ని వెండిసీ విలువ కట్టుకునేందుకు మిమ్ములను ఎత్తిపట్టుకున్నప్పుడు, మీ మోదఖేదాలలో ఏదోఒకటి హెచ్చాలి, ఒకటి తగ్గాలి.



అప్పుడు, గృహ నిర్మాణకారుడు,
"గేహాలు" వివరించండి అన్నాడు.

అతడు సమాధానించాడు:

నగర ప్రాకారంలో నీఇంటిని కట్టు కుంటానికి పూర్వం నీఊహలకు అరణ్యంలో నికుంజాన్ని నిర్మించుకో !

ఎందుకంటే, నీవు నీ సంధ్యా సమయంలో ఇంటికి తిరిగి వస్తున్నట్లే, నీ హృదయనివాసి, ఆ అనంత దూరైకాంత సర్వ సంచారి గూడాతిరిగివస్తాడు.

మరెంత విశాలమైన నీదేహమే నీగేహం!

అది సూర్య కాంతిలో అభివృద్ధి చెందుతుంది; నిశీధినీ నిశ్చలతలో నిద్రిస్తుంది. అది స్వప్నాలు లేనిదికాదు. నీఇల్లు కలలుగనడంలేదా ? కలలుగంటూ, అదిపట్టణాన్ని విడిచి, ఏ పూలపొదరింటికో, కొండకోనమీదకో పయనించడంలేదా?

మీ ఇళ్ళను నాచేతిలోకి సేకరించుకుని, వాటిని విత్తనాలు వెదబెట్టేవాడి మాదిరిగా, అడవిలో, పచ్చిక బీడులో అటు ఇటు విరజిమ్ముతానుగనుకనా?.

ఈ లోయలు మీనగరవీధులుగా, ఈపచ్చిక బీళ్ళు మీ ఉద్యాన భూములుగా ఉంటే ద్రాక్షోద్యానాలలో ఒకళ్ళనొకళ్ళు అన్వేషించుకొని, ధరా సౌగంధ్యాన్ని మీపరిధానాలలో పట్టుకురావడానికి వీలుగాఉండేది.

కానీ, ఈ విషయాలింకా సమకూడలేదు.

తమలో ఉన్న భయం కొద్దీ, మీతాత ముత్తాతలు, మిమ్మల్ని మరీదగ్గరకు చేర్చుకున్నారు. మరి ఆ భయం ఇంకా కొద్దికాలం కొనసాగుతుంది ఇంకా కొద్ది కాలం వరకూ మీ హృదయాలను మీనగర కుడ్యాలు, మీ క్షేత్రాలనుంచి విడదీస్తవి.

ఆర్ఫలెస్ పౌరులారా! మీ కీ గేహాల్లో ఏముందో మరి మీరంతగా తలుపులు బిగించి కాపాడుకుంటున్న ఆవస్తువేదో చెప్పండి.

మీ శక్తిని ప్రత్యక్షీకరించే, ప్రశాంత ప్రోత్సాహ మనశ్శాంతి మీ కున్నదా ?

మానసికోన్నత శిఖరాలను అలంకరించే, మసక వెలుగుల తోరణ మండలాలు అనే జ్ఞాపకాలు మీకున్నవా?

మీ హృదయాన్ని, దారుశిల శిల్పరూపాల నుంచి పవిత్రపర్వతానికి తీసుకొనిపోయే సౌందర్యం మీ కున్నదా?

ఇవన్నీ మీ ఇళ్ళల్లో ఉన్నవా? చెప్పండి!

లేక, నెమ్మదిగా రహస్యంగా ఇంట్లోకి అతిథిగా అడుగు పెట్టి, ఆ పైన తానే లతిథ్య మిచ్చేదిగా సిద్ధమై, అటుతరువాత ఆధిపత్యం వహించే, సౌఖ్యం-సౌఖ్య తృష్ణమాత్రమే ఉన్నవా?

అంతే కాదు, అది, అందరినీ మాలిమి చేసుకుంటుంది. అంకుశం, కొరడా తీసుకుని, మీ అధికతర ఆకాంక్షలను తనకు కీలు బొమ్మలుగా చేసుకుంటుంది.

దానిచేతులు, పట్టుదారాలవలె మెత్తగా ఉన్నా, గుండె మాత్రం ఇనుప గుండు! అది, నీ శయ్యాదగ్గర నిలబడి, నీ దైహిక గౌరవాన్ని అపహసించడం కోసమే నిన్ను జోకొట్టి నిద్రబుచ్చుతుంది.

అది, నీ పటిష్ఠాలైన పంచేంద్రియాలను పరిహసించి, పగిలిన కుండపెంకులను మాదిరిగా ముళ్ళపొదల్లో విసిరి పారేస్తుంది.

సుఖసౌకర్యతృష్ణ, ఆత్మధర్మాభిలాషను హత్యచేసి, అంత్య క్రియా సమయంలో అట్టహాసం చేస్తూ తిరుగుతుంది.
శ్రాంతిలో విశ్రాంతి హీనులు, విశాల విశ్వాంతరాళ సంతానమూ అయిన మీరు మాత్రం, పంజర బద్ధులుగానీ, వశవర్తులుగానీ కాకూడదు.

మీ గేహం లంగరు కాకూడదు. అది, ఎత్తిన తెరచాప కావాలి. అది, గాయాన్ని కప్పిపుచ్చే తళుకు కాగితం కారాదు. కంటినికాచే కనురెప్ప కావాలి.

మీరు, ద్వారాల్లోనుంచి పోవడానికి అనువుగా మీ రెక్కలు ముడుచుకునే అవసరం లేదు.

ఇంటికప్పు కొట్టుకుంటుందేమోనని తలలు వంచుకునే పనిలేదు. గోడలు పగుళ్ళుచూపి పడిపోతవేమో నని ఊపిరి విడవడానికి భయపడే నిమిత్తంలేదు.

సజీవులకోసం నిర్జీవులచే నిర్మింపబడ్డ సమాధుల్లో మీరు నివసించనక్కరలేదు. నీ గేహం సర్వవైభవాలతో, సముజ్జ్వలంగా ప్రకాశిస్తున్నా, అది మాత్రం నీ రహస్యాన్ని అట్టిపెట్టుకోదు; కాక, నీ అభీష్టానికి ఆశ్రయం కల్పించదు.

ఎందుకంటే, నీలో ఉన్న అనంత్యం, ప్రాభాత నీహారం ద్వారంగా, నిశానిశ్శబ్ద సంగీతాలు గవాక్షాలుగా విరాజిల్లే ఆకాశమహా సౌధంలో అధివసిస్తుంది.



అప్పుడొక సాలి,

"పరిధానాలు" వివరించండి అన్నాడు :

అతడు సమాధానించాడు :

నీ వస్త్రాలు నీ సౌందర్యంలో అధికభాగం దాచిపెడతవి. ఐనా, అవి, అసౌందర్యాన్ని మాత్రం దాచిపెట్టవు.

నీ పరిధానాలలో నీవు ఐకాంతిక స్వేచ్ఛను అన్వేషించు కుంటున్నా, నీకు మాత్రం వాటిల్లో ఒకరకమైన శృంఖల తటస్థపడవచ్చు.

నీ ఉడుపుల ద్వారాకంటే, నీ దేహంతోటే గాలినీ, సూర్యుణ్ణీ అత్యంత సన్నిహితంగా అధికాధికంగా అనుభవించ వచ్చునని నీ అభిప్రాయము.

సూర్య కాంతిలో జీవన శ్వాసఉంది : గాలిలో జీవన హస్తం ఉంది.

"మేం ధరించే వస్త్రాలను, ఉత్తరపు గాలే నేసింది" అంటారు మీలో కొందరు.

నేను గూడా  ఔను! ఉత్తరపుగాలే  అంటాను, కానీ దానిమార్గం అవమానం.  దాని నూలు మెత్తని నరాలు.  అది, తనపని ముగించుకుని అరణ్యంలో హసించింది.

అపరిశుద్ధ నేత్రాన్ని కప్పే కవచం, వినయం! అన్న విషయం మరువకు మరి.  ఇక, అపరిశుద్ధత అంటూ నే లేకపోతే, వినయం కేవలం ఒక శృంఖల, మానసిక కల్మష కారణంగాక ఏమిటి మరి? భూమి, నీ నగ్న చరణ స్పర్శతో మహానందానుభూతి పొందుతుంద నీ, గాలులకు, నీ ముంగురులతో కలసి ఆడుకుందామనే ఆకాంక్ష ఉన్నదన్న విషయం మరిచిపోకు మరి!



అప్పుడొక వర్తకుడు,

'క్రయ విక్రయాలను' గురించి పలకండి! అన్నాడు.

అతడిట్లా సమాధానించాడు :

ఇలాతలం నీ కోసం తన ఫలాన్ని అందిస్తుంది. మరి, నీవు నీ చేతులు నింపుకోవడం ఎట్లాగో తెలుసుకుంటేగాని, దాన్ని, కోరవు.

భూమాత ప్రసాదించే కానుకలను వినిమయం చేయడంలోనే, నీకు పుష్కలంగా లభిస్తుంది!

తృప్తి చెందుతావు.

ఐనా, ఈ వినిమయం అనురాగపూర్వకంగా, దయాధార్మికయుతంగా, జరుగనంత వరకూ, కొందరిని దురాశకు, మరికొందరిని ఆకలికీ పడలాగుతుంది.

సముద్రంమీద, సస్యక్షేత్రాలల్లో, ద్రాక్షోద్యానాలల్లో పరిశ్రమించే మీరు, సంతలో సాలీలను కుమ్మరులను, సుగంధద్రవ్య సంపాదకులనూ కలుసుకున్నప్పుడు, భూమాత ప్రముఖాంతరాత్మను మీ మధ్యకు ఆవాహన చేసి, త్రాసుల్ని, విలువకు విలువకట్టే మహాపరిమాణాన్ని అభిమంత్రించి పూతం చేయండి!

మీ పరిశ్రమకు తమ మాటలు అమ్మజూపే శూన్య హస్తాల జాతికి, మీ వ్యవహారాలల్లో జోక్యం కల్పించుకునే అవకాశం ఇవ్వకండి!

అటువంటి శుష్కప్రియాల, శూన్యహస్తాల జాతికి ఇట్లా చెప్పండి!

"మాతోబాటు పొలాలకు రండి! కాకపోతే, మా సోదరులతో బాటు సముద్రానికి పోయి వలపన్నండి సస్యక్షేత్రం, సముద్రం మాకిచ్చినట్లే, మీకూ పుష్కలంగా అనుగ్రహిస్తవి!

మరి, గాయకులు, నాట్యకారులు, మురళీ గాన విశారదులు మీ దగ్గరకు రావడం తటస్థిస్తే వాళ్ళ సుకృతి విశేషాలు గూడా కొనండి!

వాళ్లు గూడా ఫలాలు, సుగంధ ద్రవ్యాలు సేకరించు కుని వచ్చేవాళ్ళే, కానీ, వాళ్లు స్వప్నాల్లో రూపొందించిన తెస్తారు. ఐనా, అవి, మీ ఆత్మలకు పరిధానాలు; ఆహారం

మీరు, సంతను విడిచివచ్చేముందు, అక్కడకువచ్చిన ఏ వ్యక్తిగానీ, శూన్యహస్తంతో గృహోన్ముఖుడు గాకుండా చూడండి!

ఎందుకంటే, మీలో అత్యల్పుడి అవసరాలుగూడా సంతృప్తిపరచనంత వరకూ, భూమాత ప్రముఖాంతరాత్మ గాలిసెజ్జపై ప్రశాంతంగా కన్నుకూర్కనే కూర్కదు.

ఆప్పుడు నగర న్యాయాధిపతి ఒకడు ముందునిలబడి,
"నేరం-శిక్ష" విశదీకరించండి అన్నాడు :

అతడిట్లా ఉపక్రమించాడు :

నీ అంతరాత్మ గాలిమీద అట్లాఅట్లా పచారులు చేస్తున్నప్పుడు, ఎవళ్ళ పర్యవేక్షణా లేక ఒంటిగా ఉన్న నీవు, పరులకు అపకారం చేస్తావు. తద్వారా నీకు నీవే ఆపకృతి కలిగించుకుంటావు.

ఆ అపకారం చేసినందుకుగాను, ధన్యజీవి ప్రాసాద ముఖద్వారం దగ్గర, నీవు కొంతకాలం నిర్లక్షితుడుగా వేచి ఉండాలి.

నీలోని దైవాంశ మహాసముద్రంవంటిది.

అది, ఏనాటికీ కలుషితంకాదు.

అది, గగనాంతరాళం మాదిరి రెక్కలున్నవాళ్ళనే ఉద్ధరిస్తుంది.

నీ దైవాంశ సూర్యుడివంటిదిగూడా.

దానికి వక్రమార్గాలు తెలియవు. అది సర్పరంధ్రాలు అన్వేషించదు.

కానీ, నీలో దైవాంశ మాత్రమే ఒంటిగా ఉండదు. నీలో ఇంకా మానవాంశ, ఇంకాకొంత అపరిపక్వ మానవాంశ ఉన్నది.

నిరాకార వామనాంశ ఒకటి, శూన్యంలో నిద్రమైకంలో సంచరిస్తూ, తన జాగ్రదవస్థకోసం అన్వేషించుతుంటుంది.

మరి, నేనిప్పుడు నీలోఉన్న మానవాంశను గూర్చి మాట్లాడుతాను.

ఎందుకంటే, నీలోఉన్నదైవాంశగానీ, లేక శూన్యంలో తిరుగాడే వామనాంశగానీ, నేరాన్ని - నేరానికితగ్గ శిక్షనూ తెలుసుకోవు. నీలో ఉన్న మానవాంశమాత్రమే అందుకు సమర్థమైంది.

మీరు ఒక అపరాధం చేసినవాడిని గురించీ, అతడు మీ వాడు కాదన్నట్లు, మీకు కేవలం అపరిచితుడైనట్లు, హద్దులుదాటి మీప్రపంచంలోకి పరుగెత్తుకువచ్చిన దుండగీడన్నట్లు, మాటిమాటికీ అంటుండడం ఆలకించాను.

ఏ మహానుభావుడుగానీ, ఏ సత్ప్రవర్తకుడుగాని, మీలో ప్రతివ్యక్తిలోఉన్న పరమోన్నతస్థాయిని సమధిగమించి ప్రవర్తించలేనట్లే, ఏ దుర్మార్గుడుగాని, ఏ భ్రష్టుడుగానీ, మీ ప్రతిఒక్కడిలోఉన్న అధమాధమ స్థితికన్నా మించిన అధమస్థితికి జారిపోడు, అంటాను నేను.

మొత్తం వృక్షంయొక్క మౌనపూర్వకమైన ఎరుక లేకుండా, ఆ చెట్టుమీది ఏ ఒక్క ఆకుగూడా పసుపుకు తిరగనట్లే, మీ అందరిలో ఉన్న అంతర్నిగూఢేచ్ఛ లేకుండా, ఏ అపరాధీ అపరాధం చేయలేడు.

మీరందరూ ఊరేగింపుగా మీ దైవాంశ దిశగా కలిసి సాగుతారు.

మీరే బాట; మీరే బాటసారులు.

మీలో ఎవడైనా క్రిందబడితే, అతడు తన వెనకాల వస్తున్నవాళ్ళకు 'ఇదుగో! ఇక్కడ దారిలో బండరాయి ఉంది' అని హెచ్చరికగా పడ్డాడన్నమాట.

అంతేకాదు; తడబడకుండా వేగంగా తనకన్నముందు వెళ్ళినవాళ్ళు, దారిలో ఉన్న ఈ బండరాయిని ప్రక్కకు తొలగించకుండా పట్టించుకోకుండా పోయినందుకు ప్రతిఫలంగానూ, అతడు పడ్డాడన్నమాట.

ఈ నే చెప్పబోయే మాట మీ గుండెలమీద గుదిబండగా పడ్డా వినండి :

హత్య చేయబడ్డవాడు, తనకుజరిగిన హత్యకు సంజాయిషీ ఇచ్చుకోకుండా ఉండడానికి వీలులేదు.

దోచుకోబడ్డవాడు, తానుదోచుకోబడ్డందున నిర్దుష్టుడేం కాదు.

సన్మార్గుడు, దుర్మార్గుని అకృత్యాలు తెలియని అమాయకుడేం కాదు.

శ్వేతహస్తుడు, దుర్మార్గాలుచేయని నిర్మలుడు కాడు.

దోషి, గాయపడ్డవాడికి తరచుగా బలియైనవాడే !

గర్హితుడు. ఇంకాతరచుగా, దోషరహితులకూ, అనిందితులకూ, భారవాహుడౌతాడు.

అధర్మపరులనుంచి ధర్మపరులనూ, దుష్టులనుంచి శిష్టులనూ ప్రత్యేకించలేవు.

వాళ్ళా సూర్య సమక్షంలో నల్లతెల్లదారాల కలయు నేతగా కలిసి ఉంటారు.

నేతలో నల్లనూలు తెగిపోతే సాలి, మొత్తం గుడ్డనే గాకుండా మగ్గాన్నిగూడా పరిశీలించాలి.

మీలో ఎవడైనా, కృతఘ్నురాలైన గృహిణిని, న్యాయనిర్ణయంకోసం పట్టుకువచ్చినప్పుడు, ఆమెభర్త హృదయాన్ని గూడా, ఆతణ్ణి త్రాసులో తూచనీయండి! అతడి ఆత్మను కొలమానంతో కొలవనీయండి!

అపరాధిని కొరడాతో బాదేవాడిని, అపరాధం జరిగినవాడి అంతరాత్మలోకి గూడా అవలోకించమనండి!

మీలో ఎవడైనా ధర్మంపేరుతో దుష్టవృక్షమూలాన్ని గొడ్డలిపెట్టుపెట్టడానికి, సిద్ధమైనవాడుంటే, అతడిని దానివేళ్ళ కుదుళ్ళుగూడా గమనించమనండి !

అప్పుడతడు మంచివీ, చెడ్డవీ, ఫలవంతమైనవీ, నిష్ఫలమైనవీ, అన్నీ మౌనధరాహృదయంలో పెనవేసుకుని ఉండడం కనుగొంటాడు.

ఇక న్యాయనిర్ణేతలైన మీ విషయం : మీలో ఎవడు సధర్ముడు ?

భౌతికవిషయంగా, బహునిజాయితీగా ఉన్నా, మానసికంగా మహాచోరుడగా ఉండేవాడికి మీరిచ్చే ధర్మ నిర్ణయం ఏమిటి ?

తాను ఆత్మగతంగా హత్యగావింపబడి, ఇతరుడిని దైహికంగా వధించినవాడికి మీరు చెప్పే శిక్ష ఏమిటి ?

ఆచరణలో వంచకుడిగా, పీడకుడిగా కనబడుతూ, తాను ఇతరులవల్ల దుఃఖానికి, దురాగ్రహానికీ గురియైనవాడిని, మీరు ఏమని నిర్బంధిస్తారు ?

తాము చేసిన దుష్కృత్యాలకన్నా, అత్యధికంగానే పశ్చాత్తప్తులైన వాళ్ళను, మీరెట్లా శిక్షిస్తారు ?

మీరు ఆనందముతో సేవించే ఆ న్యాయసూత్రం ప్రకారం, పశ్చాత్తాపం, ధర్మకృత్యంగాదా ? ఐనా అన్నెం

పున్నెంతెలియని అమాయకులమీద, మీరు, పశ్చాత్తాపాన్ని విధించనూలేరు, కాక దోషిహృదయంనుంచి దాన్నితొలగించనూ లేరు.

మానవులు నిద్రనుంచి మేల్కొని, తమను తాము సమగ్రంగా సందర్శించుకోవడానికి, ఆ పశ్చాత్తాపం, నిశా సమయంలో అనాహూతంగానే ప్రత్యక్షమౌతుంది.

మరి ధర్మాన్ని, అవగతం చేసుకుందామనుకునే మీరు, సర్వకార్యకలాపాలనూ, సమగ్రజ్యోతిస్సమక్షంలో సమవలోకన సమీక్షాకర్తవ్యులు గానంతవరకూ, ఎట్లా అర్థంచేసుకుంటారు దాన్ని ?

నిటారున నిలబడ్డవాడూ, నిలువునా క్రిందబడ్డవాడూ, ఇద్దరుగా కనబడ్డా, తనలోఉన్న, వామనాంశ అనే రాత్రికీ, దైవాంశ అనే పగటికీ మధ్య మసక చీకటిలో నిలుచున్న ఒక్కడే అన్న విషయం అప్పుడుగాని, మీకు గ్రాహ్యానికిరాదు.

అప్పుడుమాత్రమే, దేవాలయంగోడ పునాదిలో ఉన్న రాతికన్నా, దేవాలయం శిఖరంమిద ఉన్నరాయి ఉన్నత స్థానంలో లేదన్న మహాసత్యం గోచరిస్తుంది మికు !



## అప్పుడొక న్యాయవాది వచ్చి,
## ఆచార్యా! మా 'న్యాయసూత్రాల' విషయం? అన్నాడు:

అతడిట్లా సమాధానించాడు :

న్యాయసూత్రాలు విధించడంలో ఆనందపడతారు మీరు.

ఐనా, పిల్లలు, సముద్రతీరంలో శ్రద్ధగా ఇసుక బొమ్మరిండ్లు కట్టుకుని, ఆడుకుని ఆఖరికి కేరింతలుకొడుతూ వాటి నన్నింటిని నాశనం చేసేతీరుగా, మీరూ ఆన్యాయసూత్రాలను భగ్నంచేయడంలో అధికానందం పొందుతారు.

మీరు, ఇసుకగోపురాలు నిర్మించుకునేటప్పుడు, సముద్రం తనతీరానికి మరింత ఇసుక మోసుకవస్తుంది. మరి మీరు వాటిని పాడుచేసేటప్పుడు, మీతోబాటే ఆ సముద్రమూ నవ్వుతుంది.

సముద్రం ఎప్పుడూ అమాయకులతో కలసి నవ్వుతుంది.

కానీ, జీవితాన్ని సముద్రంగానూ, న్యాయసూత్రాలను ఇసుకగోపురాలుగానూ, భావించుకోనివాళ్ళు ఉన్నారు గదా!

వాళ్ళదృష్టిలో జీవితం ఒక మహాశిల. న్యాయ సూత్రాలు ఆ మహాశిలమీద తమరూపాలను మలుచుకునే ఉలి. మరి, ఇటువంటివాళ్ళ విషయం ఏమంటావు ?

నాట్యకారులను ద్వేషించే కుంటివాడి సంగతి ఏమిటి ?

అడవిలో ఉండే దుప్పినీ, జింకనూ కొంపాగోడూ లేకుండా, అస్థిరంగా అక్కడక్కడా జీవించే వ్యర్థజీవులుగా భావించి, తానుమోస్తున్న కాడినే గొప్పగా ప్రేమించే ఎద్దు విషయం ఏమిటి ?

తక్కిన పాముల్ని, సిగ్గూఎగ్గూలేకుండా దిగంబరంగా తిరిగేజాతి అని అవహేళనచేసే, కుబుసాన్ని వదలలేని ముసలి పాము సంగతేమిటి ?

పెళ్ళివిందుకు పెందలాడేవచ్చి, కుతికదాకా మెక్కి, ఆయాసంతో, తిరిగిపోతూ విందులన్నీ సాంఘిక నియమ భంగాలనీ, విందులు చేసే వాళ్ళంతా న్యాయసూత్ర భగ్న కారులనీ, అనే వాడి విషయం ఏమిటి ?

వాళ్ళూ, సూర్యుడివెలుగులో నిలబడిఉన్నా,సూర్యుడికి అనభిముఖంగా, నిలబడ్డవాళ్ళని చెప్పడంకన్నా, నేనుమాత్రం వాళ్ళన గురించి ఇంకేం పలుకగలను ? వాళ్ళు కేవలం తమ నీడలే చూచుకుంటారు. వాళ్ళకు వాళ్ళనీడలే న్యాయ సూత్రాలు. మరి, వాళ్ళదృష్టిలో సూర్యుడంటే, నీడలు కల్పించేవాడుగా గాక ఇంకా ఎట్లా ఉంటాడు ?

క్రిందకువంగి, నేలంగా దపడ్డ తమనీడలను గుర్తుపట్టు కోవడంకన్నా, వాళ్లకు న్యాయసూత్రాలు గ్రహించడం అంటూ ఏముంది ?

కానీ, సూర్యుడికి, అభిముఖంగా పయనించే మిమ్ములను నేలమీదఉన్న ఏ ప్రతిబింబాలు పట్టి నిర్బంధించగలవు ?

గాలితోకలిసి పయనించే మీకు, ఏ వాయుసూచిక మార్గాన్ని సూచిస్తుందంటారు ?

నీ మెడమీద ఉన్న కాడిని, ఎవడిదీకాని జైలుద్వారం మీద వేసి విరగ్గొడితే, ఏమానవుని శాసనం బంధిస్తుంది నిన్ను ?

నాట్యంచేసి, ఎవడికీ చెందని అయఃశృంఖలాలమీద నీవు కూలిపడితే, ఏ శాసనాలకు భయపడతావు ?

నీ పరిధానాన్ని నీవే చించుకుని, ఎవడిదీగానిదారిలో పడవేస్తే, ఇకనిన్ను తీర్పుకని తీసుకుపోయే నాథుడెవడు ?

అర్ఫలెస్ పౌరులారా! మీరు, నగారా నోరుమూత వేయవచ్చు ? వీణాతంత్రులు వీడలాగేయవచ్చు ?

కానీ, భరద్వాజాన్ని పాడకుండా చేయడం ఎవరితరం ?



అప్పుడొక వ_క్త 'స్వేచ్ఛను' వివరించండి అన్నాడు :

అత డుపన్యసించాడు :

సర్వ నిరంకుశుడిముందు సాష్టాంగపడి, వాడు తమ ప్రాణాలను హరించుకు తింటున్నా, అభినందించే బానిసల్లాగా, మీ నగరప్రాకారం దగ్గర మీఇళ్లలో నెగళ్ల దగ్గర చాగిలపడి మీరు,మీ స్వేచ్ఛనుమాత్రమే ఆరాధించుకోవడం అవలోకించాను.

అంతేకాదు; దేవాలయ నికుంజంలో, కోటగోడల నీడలో, మీలో అత్యంత స్వేచ్ఛగలవాళ్లు, ఆ స్వాతంత్ర్యాన్ని తమ మెడలమీదికాడిగా, తమ కరశృంఖలగా వహిస్తూండడం గమనించాను.

మరి, నాహృదయం, నాలో నెత్తురులు వర్షించింది.

స్వేచ్ఛే నీ పరమలక్ష్యస్థానమనీ, సర్వాభీష్ట ప్రదాత్రి అనీ నీ వనడం మాకున్నప్పుడు, తుదకు నీలోని స్వేచ్ఛా కాంక్షగూడా నీకొక ప్రతిబంధకంగా భాసించినప్పుడు మాత్రమే, నీవు నిజంగా స్వేచ్ఛాజీవివి కాగలుగుతావు.

నీవు, నీ జీవితాహస్సులను నిర్లక్ష్యంచేయనప్పుడు, మరి నీ నిశలు వాంఛారహితాలుగా, విషాదవిహీనాలుగా ఉన్నప్పుడే వా_స్తవంలో నీవు స్వేచ్ఛాజీవి వవుతావు.

ఒక వేళ ఈవిషయాలు నీజీవితాన్ని చుట్టేసినా, నీవు వీటికి అతీతంగా, నగ్నంగా, నిర్నిబంధంగా ఉంటావు.

మరి, నీ వివేకోదయసమయంలో, నీవుగా, నీమట్టు మధ్యాహ్నం తరుణం చుట్టూగట్టిగా చుట్టుకున్న సంకెళ్ళను పటాపంచలు చేసుకోనంతవరకూ, నీ జీవితాహర్నిశలను ఎట్లా అధిగమించి పోగలుగుతావు ?

యధార్థంలో, ఈ శృంఖలాచయంలో అత్యంతం బలిష్ఠంగాఉన్న శృంఖలను తగిలించుకుని, నీవు, దాన్నే స్వేచ్ఛగా వ్యవహరిస్తున్నావు.

దాని గొలుసులు సూర్యకాంతిలో తళతళా మెరవనూ వచ్చు; నీ కళ్ళకు మిఱుమిట్లు గొల్పనూవచ్చు; ఐనా అది శృంఖలేగదా !

ఇంతకూ నీవు స్వేచ్ఛాజీవివి కావడానికి, నీ ఆత్మీయ శకలాలను కొన్నింటిని పరిత్యజించడంతప్ప, నీవు చేసే ఘనకార్యం ఏమిటి ?

అది ఒక ధర్మశాసనమైతే, దాన్ని నీవు తొలగిస్తావు. ఆ శాసనాన్ని, నీ నొసట నీవే స్వయంగా లిఖించుకున్నావు.

నీ ధర్మశాస్త్రగ్రంధాలను తగలబెట్టడం వల్లగానీ, సముద్రాన్నే పట్టుకువచ్చి, నీన్యాయాధిపతుల ఫాలభాగాలమీద

క్రుమ్మరించి, పడరుద్దడంవల్లగాని, నీ వాశాసనాన్ని మాపు చేయలేవు.

ఒకడు, నిరంకుశచండశాసనుడైతే, వాడిని సింహాసన భ్రష్టుడినిచేస్తావు. కాని, వాడు నీలోనే నెలకొల్పిన సింహాసనాన్ని నాశమయ్యేటట్టుచూడు ముందు.

స్వేచ్ఛాజీవులకు, గర్విష్ఠులకూ, తమస్వేచ్ఛలోనే ఒక రకమైన నిరంకుశత, తమగర్వంలో నే ఒకరకమైన అవమానం ఉండకపోతే, వాళ్ళను నిరంకుశుడు ఎట్లా ఏలగలుగుతాడు ?

అది, అప్రమత్తతేఐతే, నీవు నీకు కల్పించుకున్నదిగాని, ఎవరో నీనెత్తినమోపిన భారం కానందున వద్దనుకుంటే తీసి దూరంగా విసిరేయవచ్చు.

అది భయమేఐతే, భయపడ్డ వాడి చేతిలోగాకుండా, అది నీ హృదయంలోనే పీఠంపెట్టిందిగాబట్టి, నీవు దాన్ని మెడబట్టుకుని బైటుకు గెంటివేయవచ్చు.

ఇచ్ఛాద్వేషాలు, అనుకూలప్రతికూలాలు, అపేక్షితా నపేక్షితాలు, అన్నీ అర్ధాలింగనంగా పెనవేసుకుని నీలోనే నిరంతరం తిరుగుతున్నవి.

ఇవన్నీ, అంటిపెట్టుకున్న వెలుగునీడల జంటల్లాగా నీలోనే సంచరిస్తున్నవి. నీడమాసిపోయినప్పుడు, మిణుకు మిణుకుమనే దీపం మరొక దీపానికి నీడగా ఉంటుంది.

అట్లాగే, నీస్వేచ్ఛ తనకున్నసంకెళ్ళను వదిలించుకున్నప్పుడు, అంతకంటె, అధిక స్వేచ్ఛకు తానే ఒక శృంఖలగా సిద్ధమవుతుంది.



అప్పుడు పూజారిణి మళ్ళీ
"వివేకము - లౌల్యము" విశదీకరించండి అన్నాది

అతడు సమాధానించాడు :

నీ భావవికారాలమీదా; నీబుభుక్షమీదా తరచుగా నీమనస్సూ, బుద్ధీ కలసి కత్తులుదూసే రణరంగమే నీ ఆత్మ.

నేను నీ ఆత్మలోశాంతి నెలకొల్పగలవాడినైతే, నీలో అనభిముఖంగా, పరస్పర ప్రతికూలంగా ఉన్న లక్షణాలను ఏకోన్ముఖంచేసి పరస్పర సామరస్యాన్ని సాధించి ఉందును.

కానీ, మీ అంతట మీరూ శాంతిస్థాపకులూ, మీలో ఉన్న అన్ని లక్షణాలను అనురాగంతో చూచేవాళ్ళూ కానంతవరకూ నేనుమాత్రం శాంతి ఎట్లా సాధించగలుగుతాను ?

సాగరసంసారనౌకఐన నీ ఆత్మకు నీ బుద్ధి చుక్కాని నీ భావవికారం తెరచాప.

మీ తెరచాపలుగాని, మీ చుక్కానిగాని భగ్నమౌతే, మీరిక సాగరమధ్యంలో అటూ ఇటూ ఊగిసలాడడమో, లేక ఎటూ కదలకుండా అర్థాంతరంగా ఉండడమో తప్పదు.

బుద్ధి, ఏకైకంగాపాలించే నిశ్చయశక్తి; మరి భావవికారం పట్టించుకోకపోతే, స్వనాశనానికే ప్రజ్వరిల్లే అగ్నిజ్వాల!

అందుకని, నీ బుద్ధిని భావవికారస్థాయికి అందించి, నీ ఆత్మ, దానిచేతమధురగానం చేయించనివ్వు !

నీ భావవికారం, ఫోనీక్స్‌పక్షి, తన భస్మరాశినుంచి పునర్భవంపొందేరీతిగా, ప్రతిదినోదయంపొందుతూ, నిత్య తారుణ్యంతో ప్రకాశించేటట్లుగా, దాన్ని బుద్ధి సమాదేశించేటట్లు చేయనివ్వు నీ ఆత్మను !

నీ సంకల్పాన్ని, నీ క్షుత్తునూ, నీవు అతిథిద్వయంగా సంభావించాలని నా ఆశయం.

నీవు, నిజంలో, ఒక అతిథిని మరొక అతిథికన్నా అధికంగా ఎన్నడూ గౌరవించవు. ఎందుకంటే, ఒక్కడి విషయంలోనే అతిశ్రద్ధతీసుకునేవాడు, ఉభయుల ప్రేమ విశ్వాసాలనూ కోల్పోతాడు.

పర్వతాల మధ్యలో, మహావృక్షచ్ఛాయల్లో కూర్చుని, దూరదూరాలల్లోఉన్న, సస్యక్షేత్రాలల్లో, శాద్వల సీమల్లో తాండవించే ప్రశాంతతనూ, గాంభీర్యాన్నీ అనుభవిస్తున్నప్పుడు నీ హృదయం మౌనంగా ''భగవంతుడు మనస్సులోఉన్నాడు'' అన నివ్వు.

తుఫాను వీచి, ఝంఝూనిలం అడవిని కుదిలించినప్పుడు, ఉఱుములు; మెఱుపులు ఆకాశసార్వభౌమత్వాన్ని ప్రకటిస్తున్నప్పుడు, నీహృదయం, ఆశ్చర్యసంభ్రమాలతో 'భగవంతుడు, భావవికారంలో పాదచాలనం చేస్తాడు' అననివ్వు.

మరి, నీవుగూడా, భగవంతుడి విశ్వంలో ఒకనిశ్వాసానివి కాబట్టి, భగవంతుడి మహాకాననంలో ఒకపర్ణానివి కాబట్టి, నీవు బుద్ధిలో అధివసించి, భావవికారంలో సంచరించాలి!



అప్పుడొక స్త్రీ
'వేదన విషయం' వివరించండి అన్నది :

అతడన్నాడు :

నీ ఇంగితజ్ఞానాన్ని కప్పిఉంచిన ఆవరణాండాన్ని బ్రద్దలుచేయడమే నీవేదన అంటే.

ఫలహృదయాన్ని సూర్యాభిముఖం చేయడంకోసం, దాని టెంకెను బ్రద్దలుచేయడం వంటిదిగా, నీ వేదనను అర్థంచేసుకో !

నీ జీవితంలో నిత్యం సంభవించే అద్భుతాలకు, నీ హృదయాన్ని ఆశ్చర్యచకితం చేసుకోగలిగితే, అపుడు, నీ ఆనందానికంటె, నీ వేదన తక్కువ అద్భుతప్రదంగా కనిపించదు.

నీ క్షేత్రఋతుధర్మాన్ని పరిణామశీలతను నీవు నిత్యం అనుమోదిస్తున్నట్లే, నీహృదయ ఋతుపరిణామశీలతనుగూడా ఆమోదిస్తావు.

మరి, దుఃఖశిశిరాన్ని ప్రసన్నచిత్తంతో పరికిస్తావు.

నీ వేదనలో అత్యధికభాగం, నీకై నీవే ఎన్నుకున్నది.

నీలోఉన్న ధన్వంతరి, రుజాగ్రస్తమైన నీఆత్మకు, చికిత్సార్థంగా ఉపయోగించిన చేదుమందు, వేదన. అందుకని, ఆ మహాధన్వంతరిని విశ్వసించి, నిరాకులుడవై, ఆ మహౌషధాన్ని సేవించు. అతడి హస్తం భారమైందీ, కర్కశమైందీఐనప్పటికీ, దాన్ని అశ్చర్యంగా ఉన్న అతిసుకుమారహస్తం నియోగించింది.

అతడు నీ నోటికి అందించే ఆ పాత్ర నీ పెదవులను మండించవచ్చు. ఐనా, అది, ఆ మహాకుంభకారుడు, తన పవిత్రాశ్రూదకంతో తడిపి మట్టితో నిర్మించింది.



అప్పుడొక వ్యక్తి,

"ఆత్మజ్ఞానం" వివరించండి అన్నాడు:

అతడు సమాధానించాడు :

మీహృదయాలు మౌనంగా. అహర్నిశలఅంతరార్థాలను అర్థంచేసుకుంటవి. కానీ, మీ చెవులు మీ హృదయగత విజ్ఞాన శబ్దాన్ని ఆలకించాలని, బహుతపన పడుతవి. మీరు, నిత్యం మీ భావనలో తెలుసుకునే విషయాలనే మాటల్లో అర్థం చేసుకుంటారు. మీరు మీ స్వప్న నగ్నరూపాలను, మీ కరాంగుళులతో స్పృశిస్తారు.

మీరిట్లాఉండడం సబబే.

మీ ఆత్మలో మాటుమణగిన ఊటబావి పెల్లుబికి. సాగరంలోకి జలజలా సాగిపోవాలిసిందే; మీ అంతులేని లోతుల్లోఉన్న నిధి నిక్షేపాలు, మీ నేత్రాల ముందు సాక్షాత్కరింప బడవలసిందే, కానీ, మీ అవ్యక్త నిధిని తూచ డానికి త్రాసులు మాత్రం లేకుండా చూడండి!

ఏ మానదండంతోగానీ, మీ విజ్ఞానపు లోతులు కొలుచుకోవడానికి వెంపరలాడకండి!

ఎందుకంటే,

**ఆత్మ అపరిమేయానంతాంబుధి!**

సత్యాన్ని కనుక్కున్నాను" అనడంకన్నా, ఒక సత్యాన్ని "కనుక్కున్నాను" అను!

ఆత్మపథం "కనుక్కున్నాను" అనడంకన్నా, నా బాటలో వస్తున్న ఆత్మను "కలుసుకున్నాను" అను!

ఎందుకంటే.

ఆత్మ, సర్వమార్గ సంచారిణి!

ఆత్మ, ఒకరేఖమీద నడవదు!

కాక,

అది, ఒక వంశీనాళంగానూ పెరుగదు!

**ఆత్మ శతసహస్రదళ పద్మంలాగ స్వయంగా వికసిస్తుంది!**



అప్పుడొక ఉపాధ్యాయుడు,

"అధ్యాపనం" విశదీకరించండి అన్నాడు:

అతడు పలికాడు :

ఎవడుగానీ నీ విజ్ఞానోషస్సమయంలో అర్థ నిద్రాముద్రితంగా ఉన్నదాన్నే తప్ప, నీకు మరేమీ సాక్షాత్కరింప చేయలేడు.

తన శిష్యబృందంతో దేవాలయచ్ఛాయలో సంచరించే ఆచార్యుడు, తన అంతేవాసులకు, విజ్ఞానం మీద తనకున్న శ్రద్ధానురాగాలు మాత్రమే అందిస్తాడు గాని, తన విజ్ఞానాన్ని అందివ్వడు.

వాస్తవానికి ఆ ఆచార్యుడు వివేకవంతుడే ఐతే, నిన్ను తన విజ్ఞాన వలయంలోకి ప్రవేశించమని అనుశాసించడు, అతడు, నిన్ను నీ మనః కవాటం వరకు తీసుకు పోతాడు; అంతే!

ఖగోళజ్ఞుడు, తాను విశ్వాంతరాళాన్ని గూర్చి తెలుసుకున్న విషయాన్ని చెప్పవచ్చును గానీ, నీకు తన విజ్ఞతను మాత్రం అందించలేడు.

మహా గాయకుడు సర్వాంతరాళంలో ఉన్న లయ, గానం చేసి వినిపించ వచ్చును గాని, ఆ లయను ఆకట్టుకునే చెవినిగానీ, దాన్ని ప్రతిధ్వనించే స్వరాన్నిగానీ, ఇవ్వలేడు.

గణిత శాస్త్ర పారంగతుడు, నీకు బరువులు కొలతలకు సంబంధించిన సీమల గురించి చెప్పవచ్చునుగాని, నిన్ను, ఆ సీమల్లోకి తీసుకుపోలేడు.

ఎందుకంటే, ఒకడి దర్శన విహంగం, మరొక్కడికి తన రెక్కలు అరువివ్వదు. భగవంతుడి దృష్టిలో, మీలో ప్రతి వ్యక్తి, ఏకాంతంగా ఉన్నట్లుగానే, భగవద్విజ్ఞాన విషయంలోనూ, ధరావిషయ పరిజ్ఞానంలోనూ, ఎవరికి వారు ఒంటరిగానే ఉండండి!



అప్పుడొక యువకుడు,

"మైత్రి" విషయం వివరించండి అన్నాడు:

అతడు సమాధానించాడు :

నీ అవసరాలకు ఆదుకున్నవాడు నీ మిత్రుడు.

అతడు, నీవు అనురాగంతో విత్తి, అభివందనలతో పంట పండించుకునే సుక్షేత్రం.

అతడు, నీ ఆశ్రయం: నీ ఉపశాంతి.

అతడి దగ్గరకు ఆకలితో వస్తావు; శాంతి కోసం అతడిని అభిలషిస్తావు,

నీ మిత్రుడు నీతో తన మనస్సు విప్పి మాట్లాడుతున్నప్పుడు, నీ మనస్సులో "కాదు" అనుకుంటానికి భయపడకు. ఔను" అనడానికి సంకోచింపకు.

మరి, అతడు మౌనంగా ఉన్నప్పుడు, నీ హృదయం అతడి హృదయాన్ని ఆలకించడం మానదు. ఎందుకంటే, మైత్రిలో మాటలు లేకుండానే, అన్ని ఆలోచనలు, అన్ని కోరికలు, అన్ని ఊహలూ జనించి, అవ్యాజానందంతో ఉభయుల అనుభూతికి లక్ష్యాలౌతవి.

నీ మిత్రుడి నుండి విడిపోయేటప్పుడు దుఃఖించకు.

ఎందుకంటే, దూరంగా మైదానంలో నుంచి చూచినప్పుడే తాను అధిరోహించ దలుచుకున్న పర్వత దృశ్యాన్ని పర్వతారోహకుడు సుస్పష్టంగా చూడ గల్గినట్లుగా, నీ మిత్రుడిలో ఏ లక్షణాన్ని నీవు అత్యధికంగా ప్రేమిస్తున్నావో, అది, అతడి పరోక్షంలోనే నీలో బహు విశదంగా ప్రతిభాసిస్తుంది.

ఆత్మను ప్రగాఢం చేసుకోవడం కంటె, మైత్రిలో మరొక ప్రయోజనం లేకుండా చూడు! ఎందుకంటే, ప్రేమ ఏమీ కోరకుండా, తన రహస్యాన్ని వెల్లడించేదే ఐతే, అది ప్రేమ కాదు. అది ఒక పన్నిన వల. ఆ వలలో నిష్ఫలమైనవి మాత్రమే పడుతవి

నీ కున్నవి, నీ మిత్రుడిది అనుకో. అతడు నీ అలలఆటు తెలుసుకోవాలంటే, దాని పోటుగూడా తెలుసుకోమను!

ఊసుపోక కోసం కోరుకునే మిత్రుడేం మిత్రుడు? అతడిని నిరంతరం సత్కాలక్షేపానికి అన్వేషించు! అతడు, నీ శూన్యాన్ని గాదు నింపాలిసింది: నీ అక్కరను పూర్తిచేయాలి. మైత్రీ మాధుర్యంలో ఆనందం ఉండాలి. సుఖ సంతోష భాగస్వామికం ఉండాలి. ఎందుకంటే, అల్ప విషయాల్లోని మంచు బిందువులోనే, హృదయం తన ఉదయాన్ని దర్శించి సముత్సుకోల్లాసం పొందుతుంది! *

అప్పుడొక పండితుడు,

"మాట్లాడటం" గురించి మాట్లాడండి! అన్నాడు:

అతడిట్లా సమాధానించాడు :

నీ ఆలోచనలతో నీకు సామరస్యం కుదరనప్పుడు మాట్లాడటానికి ఉపక్రమిస్తావు నీవు, నీ హృదయైకాంతికంలో నిలువ లేనప్పుడు నీ పెదవుల మీద కాపురం పెడతావు.

శబ్దం ఒక వినోదం; ఒక కాలక్షేపం.

నీ అత్యధిక ప్రసంగంలో నీ భావన సగం చచ్చి ఊరుకుంటుంది.

భావన, విశ్వవిహంగం అది, పదపంజరంలో తన రెక్కలు విప్పుకోవచ్చు గాని, పైకి ఎగురలేదు.

ఒంటరితనం భయంవల్ల మీలో కొందరు మాటకారి కోసం మథన పడతారు. వాళ్ళ మౌనైకాంతికం వాళ్ళ నగ్న స్వరూపాలను వాళ్ళ కళ్ళ ముందు నిలుపుతుంది. అందుకని ఆ దృశ్యాన్నుంచి తప్పించుకుంటానికి వాళ్ళు దారులు వెదుకుతారు. మాట్లాడే వాళ్ళలో ఒకరకం ఉన్నారు.

వాళ్ళకు విషయజ్ఞానం ఉండదు. భవిష్యదాలోచన గూడా చేయరు. తమకు గూడా అర్థం కాని ఒక సత్యాన్ని వెల్ల డిస్తారు, వాళ్ళు తమ మాటల్లో మరోరకం వాళ్ళున్నారు. వాళ్ళు సత్యాన్ని తమలో దాచుకుంటూరు. దాన్ని మాటల్లో వెల్లడించరు.

ఇటువంటి వాళ్ళ హృదయాల్లోనే, ఆత్మ, లయాన్విత మౌనంతో అధివసిస్తుంది వీధి మలుపులోగాని, సంతలో గానీ, నీవు, నీ మిత్రుడిని కలుసు కుంటే, నీలో ఉన్న ఆత్మ నీ పెదవులు కదిపి, నీ నాలుకను మాటాడించేటట్లుగా చూడు.

వర్ణాన్ని మరచిపోయినా, పాత్ర లేకపోయినా, ద్రాక్షా స వ మా ధు ర్యా న్ని గుర్తు పెట్టుకున్నట్లు, అతడి ఆత్మ నీ హృదయ సత్యాన్ని నిక్షేపించుకు ంటుంది.



అప్పుడొక ఖగోళజ్ఞుడు,
ఆచార్యా! "కాలం" విషయం? అన్నాడు.

అతడు సమాధానించాడు :

అపరిమేయావచ్ఛిన్నానంత కాలాన్ని నీవు కొలత కడుతున్నావు.

నీ ప్రవర్తనను, తుదకు నీ అంతరాత్మ గమనాన్ని కూడా, గంటల ఋతువుల ప్రకారం సరిపుచ్చుకుంటావు: నడిపిస్తుంటావు

కాలాన్ని ప్రవాహంగా భావించి, దాని తీరాన కూర్చుని, దాని గమనాన్ని గమనిస్తుంటావు. ఐనా నీలో ఉన్న కాలరాహిత్యానికి. జీవిత కాలరాహిత్యం విషయం ఎఱుకే. 'నిన్న' నేటిజ్ఞాపకం తప్ప మరేమీ కాదని, రేపు' నేటి స్వప్నం మాత్రమేనని దానికి తెలుసు.

నిన్నుంటి పెట్టుకుని నీలో గానం చేస్తున్న ఆ అనంత్యం– ఇప్పటికీ విశ్వాంతరాళంలోకి నక్షత్రాలను విరజిమ్మిన ఆ ప్రథమ క్షణావధిలోనే అధివసిస్తున్నది.

తన ప్రేమించేశక్తి అవధులు లేనిది అని ఋాలో ఎవడు అనుభూతి పొందడుగనుక? ఐనా, అవధులు లేని ఆ ప్రేమ, తన అస్తిత్వ మూలస్థానంలో ఆవరింపబడి ఉందనీ, అది ఒక ప్రేమ భావంనుంచి, మరొక ప్రేమ భావానికీగాని, ఒక ప్రేమ క్రియా కలాపాన్నుంచి మరొక ప్రేమ క్రియా కలాపానికి గానీ. సంచారం సాగించదనీ. ఎవడి అనుభూతిలో లేదు? మరి కాలం గూడా ప్రేమ మాదిరిగా విభజింప బడనిది, శాంతిరహితమైంది కాదా? కానీ, నీవు, నీ భావనలో కాలాన్ని ఋతువులుగా కొలుచుకోక తప్పనిసరి ఐతే, ప్రతి ఒక్క ఋతువుతో తక్కిన అన్ని ఋతువులనూ, వలయాకృతం గావించు: 'నిన్నటిని' జ్ఞాపకంతోనూ, 'రేపటిని' ఆకాంక్షతోనూ, 'నేడు' ఆలింగనం చేసుకునేటట్లు, చూడు.



అప్పుడు నగర వృద్ధుడొకడు,

"సజ్జనత-దుర్జనతలు" వివరించండి అన్నాడు:

అతడిట్లా సమాధానించాడు :

నేను మీలో ఉన్న సజ్జనతను గూర్చే గాని, దుర్జనతను గూర్చి పలుకలేను.

ఇంతకూ చెడు అంటే, తన ఆకలిదప్పులతో హింసింప బడ్డ మంచిగాక మరేమిటి?

మంచికి ఆకలివేస్తే, అదితుదకు చీకటి కోనల్లోగూడా ఆహారానికి అన్వేషిస్తుంది. దప్పిక వేస్తే మురుగు నీళ్ళుగూడా గతుకుతుంది.

నీతో నీవు మమైక్యంగా ఉన్నప్పుడు నీవు సజ్జనుడవు; మరి, నీతో నీవు మమైక్యంగా లేనప్పుడు, నీవు దుర్జనుడవు కావు

విభజింపబడ్డ గృహం, విభజింపబడ్డ గృహం మాత్రమే గాని, దొంగలుండే గుహ కాదు గదా? చుక్కాని లేని నౌక దారీ డొంక లేకుండగా ప్రమాద భూయిష్ఠాలైన ద్వీపాల మధ్య చిక్కుకు పోవచ్చుగానీ. అడుగంటా మాత్రం సముద్రంలో మునిగిపోదు.

నిన్ను నీవు ఇచ్చుకుంటానికి ప్రయత్నించి నప్పుడు నీవు సజ్జనుడవు.

ఐనా, మళ్ళీ నీ కోసం నీవు తాపత్రయ పడేటప్పుడు నీవు దుర్జనుడవు మాత్రం కాదు.

ఎందుకంటే, నీవు లాభం కోసం కృషి చేసేటప్పుడు, నీవు కేవలం ధరామాతకు అంటి పెట్టుకుని, ఆమె స్తన్యం గ్రోలే వృక్షమూలం వంటి వాడవు.

వాస్తవంలో, ఫలం, వేరును చూచి, "నీవు నా మాదిరిగా పరిపక్వమై, రసపరిపూర్ణమై, నిరంతరం పుష్కలంగా అందిస్తుండు!" అనలేదుగదా!

ఎందుకంటే, మూలానికి ప్రతిగ్రహణం అవసరమైనట్లే, ఫలానికి దానం అవసరం.

నీవు, నీ ప్రసంగంలో సంపూర్ణ జాగ్రదవస్థలో ఉన్నప్పుడు సజ్జనుడవు.

ఐనా, నీవు నిద్రిస్తున్నప్పుడు, నీ నాలుక నిష్ప్రయోజనంగా ఏదో నత్తులు కొడుతున్నా, నీవు దుర్జనుడవు కావు.

తుదకు తొట్రుపాటు ప్రసంగం గూడా, బలహీనమైన నాలుకకు కొంతబలం చేకూర్చవచ్చు.

నీవు, నీ గమ్య స్థానానికి పట్టుదలతో మహా గంభీరంగా పయనించేటప్పుడు సజ్జనుడవు. ఐనా, కుంటుకుంటూ పయనించేటప్పుడు దుర్జనుడవు కావు. కుంటే వాళ్ళుగూడా వెనక్కు పోరు గాబట్టి.

కానీ, శరీరవార్ధ్యం, శీఘ్రగామిత్వంగల నీవు, అదొక దాక్షిణ్య కృత్యంగా భావించి, కుంటి వాళ్ళ ముందు కుంటుతూ నడవకు.

అనేకాసంఖ్యాక విషయాలల్లో నీవు సజ్జనుడివి. మరి నీవు సజ్జనుడవు కానప్పుడు దుర్జనుడవు మాత్రం కాదు. నీవు కేవలం తచ్చట్లాడుతున్నావు. అంతే!

జింకలు, తాబేళ్ళకు శీఘ్రగామిత్వం నేర్పలేక పోవడం, జాలి బడ్డ తగ్గ విషయమే, నీ పరబ్రహ్మత్వ సిద్ధిని ఆకాంక్షించడంలోనే ని సజ్జనత ఉన్నది. ఆ ఆకాంక్ష మీా అందరిలోనూ ఉంది.

కానీ, మీాలో కొంతమందితో ఉన్న ఆ ఆకాంక్ష, పర్వతసానురహస్యాలనూ, అటవీ సంగీతాలను మోసుకుని మహా జవంతో సాగరంలోకి సాగిపోయే నిర్ఝరం వంటిది.

అదే, మరికొంత మందిలో మలుపులు దగ్గర సుళ్ళు దిరుగుతూ, మెల్లమెల్లగా పల్లానికి ప్రాకుతూ, ఊగిసలాడుతూ ఉదధి తీరానికి చేరుకునే సమతల ప్రవాహం వంటిది.

కానీ, అధికంగా ఆకాంక్షించేవాడు, తక్కువగా కోరుకునే వాడిని చూచి, 'నీవెందుకని, అట్లా నెమ్మదిగా అగుకుంటూ వస్తున్నావని' అనకుండా చూడు!

సజ్జనుడైనవాడెవ్వడూ, వాస్తవంలో, దిగంబరిని చూచి, 'నీపరిధానం ఎక్కడ?' అనిగాని, కొంపా గోడూ లేనివాడిని చూచి, 'నీ గృహం ఏమైంది?' అనిగాని అడుగడు.



అప్పుడొక పూజారిణి,

"ప్రార్థన" విషయం పలకండి అన్నది:

అతడిట్లా సమాధానించాడు :

నీ సంపూర్ణానంద సమయంలోనూ, నీకు సర్వ పుష్కలంగా ఉన్న దినాలల్లోనూ ప్రార్థిద్దామనే అభిలాషతోనే, నీ కష్టకాలంలో, నీ అక్కర వేళలో భగవత్ప్రార్థన చేస్తుంటావు.

ఇంతకూ ప్రార్థన అంటే, ఈ సజీవ విశ్వాంతరాళంలో నీ ఆత్మను పరివ్యాప్తం చేసుకోవడమే గదూ!

నీలో ఉన్న అంధకారాన్ని, నీ సుఖసౌఖ్యాల కోసంగా విశ్వాంతరాళంలోకి విరజిమ్ముతున్నట్లుగానే, నీ ఆనందం కోసమే, నీ హృదయోషస్సును గూడా విశ్వాంతరాళం లోకి విరజిమ్ముతావు

నీ ఆత్మ నిన్ను ప్రార్థనకు రమ్మని ఆదేశించి నప్పుడు, నీవు దుఃఖించడం తప్ప మరేమీ చేయలేకపోతే, ఆ ఏడుస్తున్న నీవు నవ్వేస్థితికి వచ్చేదాకా, అది, నిన్ను మాటిమాటికీ వెంటబడి పిలుస్తుంది.

నీవు ప్రార్థిస్తూ, సరిగ్గా అదే ముహూర్తంలో ప్రార్థిస్తున్న వాళ్ళను వాయుపథంలో కలుసుకుంటానికి పైకి లేస్తావు. మరి వాళ్ళను, ధ్యానంలో తప్ప మరో విధంగా నీవు కలుసుకోలేక పోవచ్చు.

అందుకని, ఆ దేవాలయంలోకి నీవు అదృశ్యంగానే వెళ్ళు! నీవక్కడికి ఆధ్యాత్మికానంద మధుర భగవత్సమ్మేళనానికే వెళ్ళుతున్నావు

కేవలం యాచించడానికి తప్ప మరే యితర ప్రయోజనం లేకుండా ఆ దేవాలయ ప్రవేశం చేసినందున, నీ కేదీ లభించదు!

నిన్ను నీవు వినమితునిగా చేసుకుంటానికి నీవు దానిలో అడుగు పెడితే, ఉద్ధరింపబడవు.

ఇతరుల క్షేమాన్ని అర్థించడానికి పోయినా, అక్కడ నీ మొరాలకింపబడదు.

నీ వదృశ్య రూపంలో అందులో ప్రవేశించడమే చాలు!

నేను, నీకు మాటల్లో ప్రార్థించే తీరు బోధింపలేను.

భగవంతుడు, తానై తానుగా నీ అధరాలద్వారా అభిభాషిస్తే తప్ప, నీ పలుకు ఆలకించడు.

పర్వతారణ్యసాగరాలు చేసే ప్రార్థనలు నీకు నేను బోధింప లేను.

కానీ, పర్వతారణ్య సాగరాలల్లో జన్మించిన మీరు మీ హృదయంలో వాటి ప్రార్థనలు కనుక్కుంటారు.

నీవు కేవలం నీరవ నిశాసమయంలో ఆలకించగలుగుతే అవి, మౌనంగా ఇట్లా అనడం వింటావు.

'మా విహంగాత్మగా భాసించే హే భగవన్! నీ సంకల్పమే మాలో సంకల్పించేది

'మాలో కాంక్షించేది నీ కాంక్షే!

'మాలో ఉన్న, నీ ఉత్సాహ శక్తే. నీ వైన నిశాసమయాలను, నీవైన అహస్సమయాలుగా మారుస్తున్నది

'మేం నిన్నేమీ అభ్యర్థించలేము. ఎందుకంటే, మా అవసరాలు, మామనస్సుల్లో గూడా తలెత్తక పూర్వమే, నీకు సువిదితాలు.

'నీవే మాఅవసరానివి. మాకు నిన్ను అధికాధికంగా ఇచ్చుకుంటూ, మాకు సర్వాన్ని అందిస్తున్నావు!



19]

అప్పుడు, సంవత్సరానికొకసారి నగర సందర్శనం
చేసే ఒక ముని ముందుకు వచ్చి నిలబడి
"ఆనందం" విశదీకరించండి అన్నాడు:

అతడిట్లా ప్రత్యుత్తరించాడు :

ఆనందం - స్వేచ్ఛాగీతిక
కానీ, అది, స్వేచ్ఛగాదు.
అది. విరిసిన నీ కోర్కెలు
కానీ, అది, వాటి ఫలితంకాదు.
అది, ఎగిరిన పంజర విహంగం!
కానీ, అది, ఆవరించిన విశ్వాంతరాళంకాదు.
ఔను! నిజం! ఆనందం స్వేచ్ఛాగీతి!

మీరు. దాన్ని సంపూర్ణహృదయంతో గానం చేయాలని నా గాఢాభిలాష!

ఐనా, ఆ గాన తన్మయత్వంలో మీ హృదయాలను పోగొట్టుకోవడం, నేనిష్టపడను.

మీలో కొందరు తరుణులు, ఆ న ం ద మే సర్వస్వమన్నట్లుగా దాన్నే అన్వేషిస్తారు. మరి వాళ్ళు విమర్శింపబడుతారు. నిందింపబడుతారు.

నేను మాత్రం, వాళ్ళను విమర్శించను; నిందించను. వాళ్ళను దాన్నే అన్వేషించ మంటాను.

ఎందుకంటే, వాళ్ళొక్క ఆనందాన్నే గాకుండా, దాని ఏడుగురు తోబుట్టువులను గూడా కనుక్కొంటారు. అందులో కడగొట్టుది ఆనందానికన్నా అందమైంది.

కందమూలాదులకని భూమిని త్రవ్వుతుంటే, నిధి దొరికిన వాడి కథ వినలేదా నీవు?

మీలో కొంతమంది పెద్దవాళ్ళు, తమ పూర్వానందాలను, త్రాగిన మైకంలో చేసిన తప్పులకు మాదిరిగా, అనుతాపంతో గుర్తుకు తెచ్చుకుంటారు.

అనుతాపం, మనస్సుకు మబ్బులు కప్పుతుంది గానీ. దాన్ని దండించదు.

వాళ్ళు, తమ ఆనందాలను, ఎండాకాలంలో వచ్చిన పంటకు మాదిరిగా, కృతజ్ఞతా పూర్వకంగా జ్ఞాపకం చేసుకోవాలి!

ఐనా, అనుతాపమే తమకు మనశ్శాంతి అనుకుంటే, వాళ్ళను అట్లాగే ఉపశాంతి పొందమనండి! మరి మీలో కొందరు, ఆనందాలను అన్వేషించే యువకులుగాకుండా, మరి వాటిని గుర్తుచేసుకునే వృద్ధులూగాకుండా ఉన్నారు.

వాళ్ళు, ఆత్మను నిర్లక్ష్యం చేయడమో, దానికి విరుద్ధంగా ప్రవర్తించడమో జరుగుతుందనే భయంకొద్దీ, ఆనందాన్వేషణ చేయకా, దాన్ని జ్ఞాపకం చేసుకోకా, అన్ని రకాల ఆనందాలకూ దూరంగా ఉండిపోతారు.

కానీ, వాటిని వదులుకోవడం గూడా వాళ్ళకు ఒక రకం ఆనందమే!

మరి, వాళ్ళు, వణకుతున్న చేతుల్తో భూమిని కింద మూలాదులకని త్రవ్వినా, వాళ్లకూ, నిధి లభిస్తుంది.

కానీ, ఒక్కమాట! ఆత్మకు అపరాధం చేయగలవాడెవడు?

కోకిల, నిశీధినీనైశ్చల్యానికి గానీ, మిణుగురు పురుగు నక్షత్రాలకు గానీ సంక్షోభాన్ని కల్పించగలవంటావా?

మరి, నీవు వ్రేల్చే అగ్నిజ్వాల గానీ, దానినుంచి వెలువడే పొగగానీ, వాయువుకు భారాన్ని కలిగిస్తాయంటావా?

ఆత్మ అంటే, నీవొక కఱ్ఱ తీసుకుని అల్లకల్లోలం చేయడానికి వీలైన కదలికలేని ఒక కుంట మాత్రమే అనేనా నీ అభిప్రాయం?

తరచుగా ఆనందాన్ని నిరాకరిస్తున్న నీవు నిజానికి, నీ అంతరాంతరాలల్లో దానికి సంబంధించిన కాంక్షను, అభిలాషను అట్టిపెట్టుకుంటున్నావన్న మాట!

అప్పుడొక కవి,

"సౌందర్యం" సమీక్షించండి అన్నాడు:

ఆతడిట్లా ప్రత్యుత్తరించాడు :

సౌందర్యం, తానుగా నీకు మార్గం, మార్గదర్శి కానంవరకూ, నీవు దాన్ని ఎక్కడ? ఎట్లా అన్వేషిస్తావు?

మరి, అది తానే మాటల కూర్పరి కాకపోతే, దాన్ని గురించి ఎట్లా మాట్లాడుతావు?

దుఃఖితులు, గాయపడ్డవాళ్ళూ ఇట్లా అంటారు :

'సౌందర్యం, దయాదాక్షిణ్యాలు కలది.

'తన మహిమకు అర్థలజ్జాన్వితయైన తరుణ మాతృమూర్తివలె, అది, మన మధ్య నడయాడుతుంది.'

విషయానురక్తులు ఇట్లా అంటారు :

'సౌందర్యం బలిష్ఠమైంది; భయంకరమైంది.

'అది, పెను తుఫాను మాదిరిగా, మన కాళ్ళ క్రింద ఉన్న భువిని, మన నెత్తిమీద దివినీ కుదిపి వేస్తుంది.'

అలసి సొలసిన వాళ్ళు ఇట్లా అంటారు :

'సౌందర్యం, చల్లగా మెల్లగా పలుకుతుంది.

'అది, మా ఆత్మలో సంభాషిస్తుంది.

'నీడకు భయపడి చలించే సన్నని దీపంలాగ, అది, తన గొంతును మా మౌనాలకు వశ్యం చేస్తుంది.

కానీ, విరామ మెరుగని వాళ్ళు ఇట్లా అంటారు :

'అది, పర్వతాలలో కోలాహలం చేయడం మేం విన్నాం.

'దాని కేకలతో, గిట్టల చప్పుళ్ళూ, రెక్కల రెపరెపలూ సింహాల గర్జనలూ సాగివచ్చినవి.'

రాత్రివేళ నగరపాలకు డిట్లా అంటాడు :

'సౌందర్యం, తూర్పుగా ఉషస్సుతో బాటు మేల్కొంటుంది.'

మధ్యాహ్నం సమయంలో శ్రామికులు, పాంథులు ఇట్లా అంటారు :

'సూర్యాస్తమయ గవాక్షాలోనుంచి, అది, భూమి మీదకు వాలడం, మేం గమనించాం.'

చలికాలంలో, హిమంలో మునిగిన వాళ్ళు ఇట్లా అంటారు ;

అది, కొండలు గెంతుకుంటూ వసంతంతోబాటుగా వస్తుంది.'

గ్రీష్మాతపంలో కోతలవాళ్ళు ఇట్లా అంటారు :

'అది శరత్కాల పర్ణాలతో నాట్యం చేయడం చూచాం. దాని తలలో హిమ కణాన్ని గమనించాము.'

సౌందర్యాన్ని గురించి మీరంతా చెప్పిన మాటలివి.

వాస్తవంలో మీరు దానిని గురించి చెప్పలేదు; తీరని కోరికలను గూర్చి మాట్లాడారు.

మరి సౌందర్యం ఒక అవసరం కాదు. అది బ్రహ్మానంద సహోదరం.

అది దప్పికగొన్న నోరుకాదు. చాచిన శూన్య హస్తం కాదు.

అది జ్వలించిన హృదయం - మంత్రించిన ఆత్మ!

అది నీవు చూడగలిగిన మూర్తి కాదు. వినగలిగిన పాటకాదు.

ఐనా నీవు కళ్ళుమూసుకున్నా కనబడే రూపం అది! చెవులు మూసుకున్నా వినిపించే పాట!

అది, తొలచిన బెరడులో ఉండే సారం కాదు. కాక, పంజాకు అతికిన రెక్క కాదు. అది, సర్వర్తు ప్రఫుల్ల శోభావహమైన కుసుమోద్యానం!

అది, నిరంతర విహారం సాగించే అప్సరస్సమూహం!

ఆర్ఫలస్ పౌరులారా!

తన పవిత్రవదనం మీది ముసుగు తొలగించుకున్న నాటి జీవితం-సౌందర్యం!

కానీ, మీరే జీవితం; మరి మీరే ముసుగు.

దర్పణంలో తననుతాను దర్శించుకునే అనంత్యం - సౌందర్యం!

కానీ, మీరే అనంత్యం, మీరే దర్పణం!



అప్పుడొక, వృద్ధ మతబోధకుడు,

"మతం" విషయం మాట్లాడండి అన్నాడు:

అతడిట్లా సమాధానించాడు :

నేనీనాడు కేవలం దాన్నిగాక ఇతరం ఏమి చెప్పాను?

సర్వ క్రియలూ, సర్వమనోభావాలూ మతం గాక మరేమిటి?

మన హస్తాలు శిలను మలుస్తున్నా, మగ్గాన్ని నేస్తున్నా, అటు క్రియారూపంగా గాక ఇటు భావనా ప్రపంచమూగాక, నిరంతరంగా మన ఆత్మలో మహాశ్చర్య జనకంగా పెల్లుబికే ఆ అనిర్వచనీయానుభూతి, మతం గాక మరేమిటి?

తానుచేసే పనులనుంచి తన శ్రద్ధనూ, తన వ్యాపార వృత్తులనుంచి తన విశ్వాసాన్ని విడగదీంచ గలవాడెవడు?

'ఇది భగవంతుడికి, ఇది నాకు. ఇది నా ఆత్మకు, ఇక ఈ మిగిలినది, నా దేహానికి' అని కాలాన్ని తనముందు పరచుకుని, ప్రత్యేకం ప్రత్యేకంగా విభజించి ఉంచగలవాడెవడు?

ధ్యానంలో, నీవు, నీవు సాధించిన వాటికన్నా ఎత్తుకు పోలేవు. అట్లాగే, నీవు పొందిన అపజయాలకన్నా మించి అడుగున పడలేవు.

నీతో అందరినీ వెంటబెట్టుకుపో!

ఎందుకంటే, నీవు ప్రదర్శించే గౌరవాదరాలల్లో, వారి ఆశలకన్నా ఇంకా వినమితుడవూ కాలేవు.

ని వొక వేళ, భగవంతుడిని తెలుసుకుంటే, అందుకని సమస్యాపరిష్కర్తగా సంసిద్ధ పడకు.

అప్పుడు, నిన్ను నీవు పరిశీలించుకో! నీ సంతానంతో ఆడుకుంటున్న ఆయనను గమనిస్తావు. విశ్వాంతరాళంలోకి విలోకించు! ఆయన మబ్బుల్లో నడుస్తూ, మెరుపుల్లో చేతులు చాచుకొని వ ర్ష ం లో భు వి కి అవతరించడం గమనిస్తావు.
ర్శిస్తావు.

ఆ యన న పూవుల్లో మందహాసం ఒలికిస్తున్నట్లుగా, ఆ తర్వాత వృక్షాలలో చేతులు పైకెత్తి ఊపుతున్నట్లుగా అవలో కిస్తావు.



మంచు క్రింద కలలు గంటున్న విత్తనాలవలె, నీ హృదయం వసంతునికై కలలు గంటుంది!

స్వప్నాలు విశ్వసించు! శాశ్వతానికి ప్రవేశించే ముఖ ద్వారం వాటిల్లోనే దాక్కుని ఉన్నది.

నీ కున్న మృత్యు భయం, రాజుగారు ఆదరంతో హస్తాన్ని, తన భుజం మీద వేయబోతున్నప్పుడు, నిలువునా కంపించి పోయే గొర్రెలకాపరి భయం వంటిది.

తాను, రాజుగారి చిహ్నాన్ని అలంకరించబోతున్నాననే ఆనందం గూడా అతడి కంపం చాటున లేదంటావా?

ఐనా, అతడు, తన మనస్సును ఎక్కువగా భయం మీదనే లగ్నం చేసుకుంటాడు గదా!

వాయు పథంలో నగ్నంగా నిలిచి, సూర్యుడిలో కరిగి పోవడం తప్ప మరణించడం అంటే మరేముంది?

మరి, ఊపిరి ఆడడం అంటే ఏమిటి?

శ్వాసను ఉచ్ఛ్వాస నిశ్వాస తరంగాలనుంచి విముక్తం చేసి, అది ఇంకా ఎత్తుకు ఎగిరేటట్లుగా చేసి, సర్వదిశాపరివ్యాపకత పొందింప జేసి, ఏ విధమైన ప్రతి బంధకాలు లేకుండా భగవంతుడి పద సన్నిధానం లభించే టట్లుగా చేయడమే గదా!

నీవు, మౌన వాహిని నుంచి పానం చేయగలిగినప్పుడు మాత్రమే, వాస్తవానికి గానం చేయ గలుగుతావు.

నీవు, పర్వత శిఖరాన్ని అధిరోహించి నప్పుడే, యథార్థంగా ఆరోహించ డానికి ఆరంభిస్తావు.

ధరాదేవి, నీ కరాంగుళులు కావాలనుకున్నప్పుడే, నిజంగా నీవు నృత్యం చేస్తావు



నన్ను మృత్యువు దాచిపెట్టినా, అత్యంత మౌనం నన్ను ఆవరించినా, మళ్ళీ మీ మనీషను అభ్యర్థిస్తాను! నేను వ్యర్థంగా అభ్యర్థించను! నేను పలికింది పరమ సత్యమే ఐతే, ఆ సత్యం, మీ భావాలకు మరింత సన్నిహితంగా ఉండే మాటల్లో, మరింత విస్పష్ట స్వరంలో వెలువడాలి! ఓ ఆర్ఫలెస్ పౌరుల్లారా! నేను వాయువుతోబాటు పయనిస్తాను.

కానీ, శూన్యంలోకి జారిపోను.

మీ అవసరాలు, నా అనురాగం సఫలీకృతమైన దినం, నేడు కాకపోతే, మరొక నాటికి, ఫలించే వాగ్దానాలుగా భావించండి.

మానవుడి అవసరాలు మారుతవి. కానీ, అతడి ప్రేమ గానీ, ప్రేమ, తన అవసరాలను సంతృప్తిపరచాలనే అతడి ఆకాంక్షగానీ, మారదు.

అందుకనే, ఇంకా ఇంతకన్నా అత్యధిక మౌనం నుంచి మళ్ళీ తిరిగి వస్తానని గ్రహించండి!

అరుణోదయంతో, క్షేత్రాలల్లో హిమకణాలను వదలి చెదరిపోయే పొగమంచు, పైకిపోయి, మబ్బుగా కూడి, అప్పుడు, వర్షంగా అవనికి అవతరిస్తుంది.

నేనూ పొగమంచు మాదిరిగానే ఉన్నాను.

నిశ్చల నిశీథాలలో, మీ వీధుల్లో నడయాడాను. నా అంతరాత్మ మీ నివాసాలలో ప్రవేశించింది

మీ హృదయ స్పందనాలు, నా హృదయంలో స్పందించినవి.

మీ ఉచ్ఛ్వాస నిశ్వాసలు, నా వదనం మీద మెత లినవి. మీ అందరినీ తెలుసుకున్నాను.

మీ ఆనందాలూ, ఆవేదనలూ, అర్థమైనవి. మీ నిద్రావస్థలోని మీ కలలే, నా కలలైనవి. అనేక పర్యా యాలు, గిరివలయాల మధ్య సరస్సులాగా మీ మధ్య ఉన్నాను.

మీలో ఉన్న శిఖరౌన్నత్యాలను, సంకుచిత సానువు లను, మీ భావాభీష్ట సంచార పశు బృందాలనూ, నాలో ప్రతి బింబించుకున్నాను.

మీ బిడ్డల నవ్వులు పిల్లకాల్వలై. మీ యువకుల కాంక్షలు మించిన నదులై నా మౌన సరస్సులో సంగమించి నవి.

ఆ కాలువలు, నదులు నా లోతులను ముట్టినా, గానం చేయడం మానలేదు!

కానీ, నవ్వుకన్నా తీయనైందీ, ఆకాంక్షకన్నా అధిక మైందీ గూడా నాదరి చేరింది!

అది. మీలో ఉన్న అనంత్యం!

ఆ విరాట్పురుషుడికి, మీ రంతా కేవలం నరాలు, జీవ కణాలు.

ఆయన మంత్రోచ్చాటనంలో, మీ అందరి గానం కేవలం నిశ్శబ్ద స్పందనం!

ఆ విరాట్పురుషుడిలో ఉన్నారు కాబట్టే, మీరూ విరా ట్రూపులు.

నేను, ఆయన్ను ఆధారం చేసుకున్నాను గనుకనే, మిమ్మల్ని ఆకట్టుకున్నాను.

ప్రేమించాను.

మరి, ఆప్రేమ. ఈ సువిశాల విశ్వాన్ని కాదని, ఇంకే సుదూరాలకు పయనించగలదు?

ఈ మహోన్నత విశ్వాన్ని అధిగమించి, ఏ దర్శనాలు, ఏ ఊహాలు. ఏ సంకల్ప వికల్పాలు విహరించ గలవు?

మీలో ఉన్న విరాట్పురుషుడు, మామిడి చెట్టు వికస నాన్ని మఱుగు పఱచిన మట్టివంటివాడు.

ఆయన బలిమి, మిమ్మల్ని మేదినికి బంధిస్తుంది.

ఆయన సౌగంధ్యం, మిమ్మలిని విశ్వాంతరాళంలోకి ఉద్ధరిస్తుంది.

ఆయన అనశ్వరత వల్లనే మీరు అమర్త్యులౌతారు!

'ఒక శృంఖలలో ఉన్న అత్యంతం బలహీనమైన సీల వంటి వాళ్ళు మీరు!' అని మి మ్మ ల ని గురించి చెప్పడం ఆలకించారు మీరు.

ఇది, కేవలం, అర్ధ సత్యం మాత్రమే! మీరు ఆ గొలుసులో ఉన్న అత్యంత బలిష్ఠమైన సీలవంటి వాళ్ళుగూడా.

మీరు చేసిన ఒ కా నొ క స్వల్పక్రియను బట్టి, మిమ్ము కొలత వేయడం అంటే,

కేవలం, అలల ను రు సు ను చూచి, అనంత మహా సాగర శక్తిని అంచనా కట్టడమన్న మాట!

మీరు పొందిన అ ప జ యా ల ను బ ట్టి, మిమ్ము నిర్ణయించడ మంటే, ఋతువులను అస్థిరాలని నిందించడం!

మీరంతా మహాసాగర సమానులు!

మీ తీరాలల్లో, మహాభార పరిపూర్ణాలైన నౌకలు, ఆటుకోసం నిరీక్షిస్తూ నిలిచి ఉన్నా, మహా సాగరం మాదిరిగానే మీరూ, మీ తరంగాల తురంగాలను తొందరగా తోలలేరు.

మీరు గూడా ఋతువుల వంటివాళ్ళు!

మీరు మీ హేమంతంలో మీ వసంతాన్ని నిరాకరించినా, మీలోనే నిద్రిస్తున్న ఆ వసంతం, నిద్రమైకంలో మందహాసం చేస్తుందిగానీ, కోపోద్రిక్తం కాదు.

ఆయన మనలని అభినందించాడు; మనలో ఉన్న మంచిని మాత్రమే చూచాడు! అని మీరు పరస్పరంగా చెప్పుకునేందుకని, నేను మీతో ఈ విషయాలు పలికానని మీరు భావించవద్దు!

మీరే మీ భావాలల్లో తెలుసుకున్న వాటినే, నేను మాటల్లో పెడుతున్నాను: అంతే!

మరి, మాటలు లేని విజ్ఞానానికి మాటలు విజ్ఞానం నీడ.

నా మాటలూ, మీ ఆలోచనలూ మన 'నిన్న'ల జ్ఞాపకాల చితాల దగ్ధంనుంచి వెలువడిన పీచికలు!

ధరామాతకు, తన విషయంగానీ, మన విషయం గానీ తెలియని ఆ, అనగా అనగా రోజుల్లో;

అల్లకల్లోల భావాలతో అవనీతలం ఆందోళించిన ఆ నిశా సమయాలల్లో, విజ్ఞాన వేత్తలు తమ విజ్ఞానాన్ని అందించడానికి మీ దగ్గరకు వచ్చారు.

మరి, నేను మీ విజ్ఞానాన్ని గ్రహించడానికి వచ్చాను.

మీలో ఉన్న ఆ ఉజ్జ్వలదాత్మ, నిరంతరం మరింతగా ప్రజ్వరిల్లుతున్నది.

దాని నిరంతర వ్యాప్త్యాధిక్యాన్ని లక్ష్యపెట్టని మీరు, మీ జీవితదినాలు విశీర్ణమైపోతున్నవని విలపిస్తున్నారు!

దైహిక జీవిత తృష్ణ చల్లారని జీవితానికే శ్మశానమంటే భయం!

ఇక్కడ గోరీ లేపి లేవు.

ఈ పర్వతాలు ఉయ్యాలతొట్టి: ఈ మైదానాలు పొదపీఠి.

మీ పూర్వీకులను ఖననం చేసిన భూమికి పోయినప్పుడల్లా, దానిని నిశితంగా పరిశీలించండి!

అక్కడ;

మీరూ మీ సంతానం చెట్టుపట్టాలు పట్టుకుని నృత్యం చేస్తుండడం గమనిస్తారు. మీకు తెలియకుండానే ఆనంద పరవశులౌతారు; మీరు ఆనంద తన్మయత్వంలో మునిగి పోతారు.

మీ విశ్వాసాలకు సువర్ణవాగ్దానలు చేసిన వాళ్ళు, మీ దగ్గరకు వచ్చారు. వాళ్ళకు, మీరు, సిరిసంపదలు, అధికారం, కీర్తి, అందించారు.

నేను, మీకిచ్చిన మాట వాగ్దానం అని అనడానికిగూడా వీలు లేదు. ఐనా మీరు నాపట్ల అత్యంత సౌహార్దం ప్రదర్శించారు. మీరు నాకు నా జీవితం మీద గాఢ తృష్ణను కల్పించారు.

మానవుడి సర్వాశయాల తత్ప్రాధరాలుగా. జీవిత సర్వ స్వాన్ని మహార్ఘురిగా మార్చగల బహూకృతి కన్నా మించిన బహూకృతి లేనేలేదు.

నా గౌరవ బహూకృతులిక్కడనే ఉన్నవి.

ఆ మహార్ఘురిలో పానం చేద్దామని వచ్చినప్పుడల్లా, అసలందులో ఉన్న సజీవ జలమే తృష్ణావిలయమై ఉండడం చూస్తున్నాను.

దాన్ని, నేను పానం చేస్తుంటే, అది, నన్ను పానం చేస్తుంటుంది

బహుమానాలందుకునే విషయంలో. మీలో కొంత మంది, నన్ను అత్యంత లజ్జావంతుడిగా, అమిత గర్విష్ఠిగా భావించారు.

కానుకలు తీసుకునేవిషయంలో కాదుగానీ, వేతనాన్ని తీసుకునే విషయంలో వాస్తవానికి నేను అతిగర్విష్ఠినే!

నన్ను, మీతో సహపంక్తి భోజనానికి కూర్చోబెట్టు కుంటానికి మీరు సర్వాసక్తులుగా ఉన్నా, నేను మాత్రం కొండలో కానలో కాయగసురులు మాత్రమే తిన్నాను;

సంతోషపూర్వకంగా, మీ గృహాలలో నాకాశ్రయం గల్పించడానికి మీరెంతగానో ఇష్టతను చూపించినా, నేను మాత్రం దేవాలయ గోపుర ద్వారంలో నిద్రించాను!

ఐనా, ఆ కాయగసురులే నాకు మధురాతి మధురం గాను, నా నిద్ర దివ్యదర్శనోజ్జ్వల విలసితం గాను, భాసించ డానికి కారణం, మీరు, నా జీవితాహర్నిశలను భక్తి ప్రపత్తు లతో పరికిస్తున్నందువల్లనే కదా!

అందుకు, మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆశీర్వ దిస్తున్నాను. మీరు, అధికంగానే ఇస్తారు, ఇచ్చిన వంగతి మీకు లేశంగూడా తెలియదు.

విచిత్ర విషయం ఏమిటంటే, తన రూపసౌందర్యాన్ని దర్పణంలో చూచుకువే కారుణ్యం, కఠిన శిలగా రూపొందు తుంది

ఒక మంచి పని, తనను తానే మృదుమధురాభిదానా లతో సంబోధించుకుంటే, అది, నిందాజనకంగా మారుతుంది.

మీలో కొందరు నన్ను ఒంటరితనానికి ఆహ్వా నించారు. మీరూ నా ఏకాకిత్వాన్ని కలిసి అనుభవించారు.

మరి, మీరన్నారు గదా నన్ను గురించి, 'ఇతడు అరణ్యాలలోని తరుబృందతో తరచు సమాలోచనలు చేస్తాడు గాని, మానవులతో మాట్లాడడు.

'ఇతడు, ఒంటిగా కొండ కొమ్ములపై కూర్చుని క్రింద నున్న మన నగరాన్ని వీక్షిస్తాడు!' అని.

నేను పర్వతాలధిరోహించిన మాటా, ఏకాంతంగా మారుమూలల దూరాల్లో తిరుగాడిన మాట వాస్తవమే!

పెద్ద ఎత్తునుంచీ, సుదూరాన్నుంచీ గాకపోతే మిమ్మల్ని ఎట్లా గమనించి ఉండేవాడిని?

ఎవడైనాగాని తాను వాస్తవంలో దూరంగా ఉండక పోతే సన్నిహితుడెట్లా అవుతాడు?

మరి మీలో కొంతమంది, వైఖరీ వాక్కుతో గాకుండా పశ్యంతీ వాక్కుతో పలికారిట్లు నన్ను గురించి,

'ఓ విచిత్ర వ్యక్తీ! ఓ విచిత్ర వ్యక్తీ! అవధి గమ్యాన్న తానురాగీ! గ్రద్దలు గూళ్ళు కట్టుకునే అంతఎత్తు కొండ కొమ్ముల్లో నివసిస్తా వెందుకు?

'అసాధ్యాన్వేషణ కాకాంక్షిస్తా వెందుకు?

'నీ పన్నిన వలతో ఏ తుఫానులు బంధిస్తావు?

'ఆకాశంలో ఏ ఆవిరి పిట్టలని వేటాడుతున్నావు?

'ఇక్కడికిరా! మాలో ఒకడిగా ఉండు.

'దిగిరా। క్రిందకు। తీర్చుకో నీ ఆకలి మా రొట్టెతో। ఆర్చుకో దప్పిక, మా మద్యంతో: '

ఆ కొంతమంది, తమ నిశ్శబ్దాంతరాత్మల్లో అన్న మాటలివి:

కానీ, వాళ్ళ మౌనం మరింత గాఢతరంగా ఉన్నట్లైతే, నేను, ఇంతకూ మీ ఆనందాల ఆవేదనల రహస్యాన్ని అన్వే షించానా, అని తెలుసుకుని ఉండే వాడినే.

నేను, విహాయస సంచారం చేసే, మీ విపుల రూపా లనే వేటాడాను.

కానీ,

వేటగాడు కూడా వేటాడబడ్డాడు।

ఎందుకంటే,

నా తూణీరాన్నుంచి దూసుకుపోయిన బాణాలే చాలా మళ్ళీ నా గుండెల్లో గ్రుచ్చుకుంటానికి మరలి వచ్చినవి।

పక్షాలు విప్పుకొని పైకెగిరిన వాడే, పాదాలు గూడా లేక నేలమీద ప్రాకే వాడైనాడు.

ఎందుకంటే,

సూర్యకాంతిలో నా పక్షాలు విప్పుకొనేటప్పటికి, వాటి నీడ, భూమి మీద తాబేలైంది.

విశ్వసించిన నేనే, సందేహంతో నిశ్వసించాను.

ఎందుకంటే,

మీలో అత్యధిక విశ్వాసం కలుగడానికని మిమ్మలిని గురించి అత్యధిక విషయ వేత్తను కావడానికని అనేక పర్యా యాలు నా వ్రణంలో నేనే నా వ్రేలు పెట్టుకున్నాను.

ఇందువల్ల కలగిన విశ్వాస విజ్ఞానలతో నే నంటున్న దిది:

మీరు మీ దేహాలల్లో బంధింపబడి లేరు. కాక, మీ గృహారామ క్షేత్రాలకూ, అంటిపెట్టుకుని లేరు.

' నీవు ' అనేది ఏదో అది పర్వతోపరి భాగంలో నివసిస్తున్నది, గాలితో పాటు సంచారం సాగిస్తున్నది.

అది: వెచ్చదనం కోసం సూర్యుడి దగ్గరకు ప్రాకిపోయేదికాదు·

భద్రత కోసమని చీకట్లోకి గోతులు త్రవ్వుకునేదీ కాదు:

అది: అవనీతలాన్ని ఆవరించి, విశ్వాంతరాళంలో విహరించే ఆత్మ విషయం!

ఈ మాటలు మీకు అస్పష్టార్థాలుగా ఉంటే, వీటిని సుస్పష్టంచేయడానికి పాటుపడకండి!

సర్వ విషయ ప్రాథమిక స్థితి అవ్యక్తంగానూ, అస్పష్టంగానూ ఉంటుంది!

కానీ,

వాటి తుది దశ అట్లా ఉండదు!

నన్ను, మీరు ప్రాథమికావస్థారూపుని గానే జ్ఞాపకం పెట్టుకుంటే, సంతోషిస్తాను.

జీవితం,

సర్వ జీవకోటి అవ్యక్తత నుంచే ఆవిర్భవిస్తుంది!

కానీ,

సుస్పష్టత నుంచి ఆ విర్భవించదు!

మణిత్వం;

భ్రష్టమైతే మబ్బురూపమే నన్న విషయం మరి తెలిసిం దెవడికి?

నన్ను, గుర్తుంచుకునే టప్పుడు ఈ విషయాన్నిగూడా గుర్తుంచుకోండి; అంటున్నాను:

మీలో,

అత్యంత బలహీనంగా, చంచలంగా ఉన్నట్లు కనబడు తున్నదే, అత్యధిక బలిష్ఠం! అచంచలం!

మీ అస్థిపంజరాలను నిర్మించి పటిష్ఠం చేసిందింతకూ మీ ఊపిరేగదా!

మీలో,

ఎవడూ కలగన్నట్లే జ్ఞాపకం లేని, ఆ స్వప్నమేగదా, మీ నగరాన్ని నిర్మించి, అందులో సర్వాన్నీ అందంగా తీర్చి దిద్దింది!

మీరు,

మీ ప్రాణ తరంగాలను దర్శించ గలిగితే, తదితర సర్వాన్నీ, చూడడం మానివేస్తారు!

మీరు,

మరి, మీ కలత గుసగుసలు వినగలుగుతే, ఇంకా, తదితరమైన ఏ శబ్దాన్నీ వినరు!

కానీ,

మీరు, దర్శించరు, ఆలకించరు;

మంచిది!

మీ కళ్ళకు కప్పిన మబ్బు తెరను వేసిన హస్తమే ఎత్తి వేస్తుంది.

మీ చెవుల్లో నిండిన మట్టిని, దాన్ని నింపిన కరాంగుళులే పూర్తిగా తొలగిస్తవి!

అప్పుడు;

మీరు దర్శిస్తారు! ఆలకిస్తారు!

ఐనా,

అంధంగా ఉన్నామని, బధిరులుగా ప్రవర్తించామనీ అప్పుడు మీరు శోకింపరు.

ఎందుకంటే,

ఆ నాడు

మీరు అన్ని విషయాలల్లోనూ మరుగు పడిన మహా ప్రయోజనాన్ని తెలుసుకుంటారు.

అప్పుడు,

మీరు వెలుగును దీవించినట్లుగానే, చీకటిని ఆశీర్వదిస్తారు.

ఈ విషయాలన్నీ వివరించిన తరువాత, అతడు,

ఒకసారి తనను తాను చూచుకున్నాడు;

కర్ణధారుడు, చక్రం దగ్గర నుంచుని, ఎత్తిన తెరచాపలనూ, పయనించవలసిన దూరాన్నీ పర్యాయక్రమంగా పరిశీలిస్తున్నాడు.

మళ్ళీ అన్నాడతడు:

నా కర్ణధారి అత్యంత సహనంతో ఉన్నాడు!

గాలి వీస్తున్నది, తెర చాపలు రెపరెపలాడుతున్నవి!

చుక్కాని గూడా చోదనానికై దిక్కులు చూస్తున్నది!

ఐనా,

నా కర్ణధారి మాత్రం నా నిశ్శబ్దానికై ప్రశాంతంగా నిరీక్షిస్తున్నాడు.

ఇంతకన్నా మించిన మహాసాగర సంగీత మాలకించిన,

ఈ, నా నౌకాయాత్రికులు గూడా,

నా అభిభాషణ అత్యంత ప్రశాంతంగా ఆలకించారు!

ఇక,

వీరు, వేచి ఉండరు,

నేనూ, సిద్ధంగా ఉన్నాను!

సెలయేరు, జలధిని చేరింది!!

మళ్ళీ, ఒక్కసారి ఆ మహామాత, తన సుతుని ఒొమ్ముకు హత్తుకుంటుంది.

అస్ఫలెన్ పౌర సర్వమా।

శు భ ం భూ యా త్!

'ఈ నాడు', ముగిసింది. సరసిజం తన రేపటి ఆవరించుకుంటున్నట్లుగా 'నేడు' మనలకు క్రమ క్రమంగా ( రిస్తున్నది.

ఇక్కడ, మనకు అనుగ్రహింపబడిన దానిని మః జాగ్రత్త పరచుకోవాలి.

మరి,

ఈ లభ్యపడిన దానితో మన మ న స్సు లు సంతృ పడక పోతే,

అప్పుడు,

మన మంతా మళ్ళీ కలిసి వచ్చి, ఆ మహా దాతన కలిసి కట్టుగ చేతులు చాచి అభ్యర్థిద్దాము!

ఇక,

ఇది ప్రభాతమే కాదు.

మధ్యాహ్నం, మన మీద వ్రాలింది, మన సగం మెలకువ, పూర్వాహ్నంగా పొలుపొందింది.

ఇక,

మనం విడక తప్పదు.

మనం,

మళ్ళీ మన జ్ఞాపక సంధ్యాసమయంలో కలుసుకుంటే,

అప్పుడు,

మీరూ,

నాకు మరింత గానం వినిపిద్దురు గాని!

మన చేతులు మరొక కలలో కలుసుకుంటే, మరొక ఆకాశ సౌధం నిర్మించుకుందాం!

ఇట్లా అంటూ, అతడు నావికులకు ప్రస్థాన సంజ్ఞ ఇచ్చాడు.

వాళ్ళు వెంటనే లంగరెత్తారు! నౌక బంధం నుంచి బైటపడింది.

తూర్పుదిక్కుగా ప్రస్థానించారు.

ఆ సమయంలోనే,

ఒకే హృదయంనుంచి అన్నట్లు అఖిల ప్రజలలో నుంచి ఒక విషాదాలాపం వెలువడింది! ఆ విషాద గీతి ఆ మసక చీకట్లో కలిసి, దుందుభిధ్వానంగా సాగరమంతా సంచారం సాగించింది.

ఆల్‌మిత్రా ఒక్కతె మాత్రమే, నౌక మీద దృష్టి సారించి, అది అగమ్యంలోకి అంతర్ధానమైపోయేంత వరకూ మౌనంగా నిలబడింది.

చేరిన పౌరులంతా చెదరిపోయినా,

ఆమె ఒక్కతే,

అతడి సూక్తిని మననం చేసుకుంటూ ఆ సాగరకుడ్యం పై నిలబడి ఉంది!

'ఇంకా కొద్ది సమయం!

గాలిలో ఒక్క క్షణం విశ్రాంతి!

అంతే!

మరొక మహిళ నన్ను గర్భధారణ చేస్తుంది!'

ముచ్చటగా, ముద్రణ చేసి ఇచ్చిన
ముగ్గురు మూర్తులు

శ్రీ ఇమ్మానుయేలుకు

శ్రీ మల్లిఖార్జునరావుకు

శ్రీ వేంకటేశ్వరులకు

కృతజ్ఞతలు



# ఆచార్య "ధనకుధరం" అనువాదాలు

## ఖలీల్ జిబ్రాన్

1. కవోష్ణ బాష్పం - కమనీయహాసం — రు 2-50
2. వాలుకాచయం - ఫేన పటలి — 2-50
3. ఎదురు తిరిగిన ఆత్మలు — 2-50
4. మహాదార్శనికోద్యానం — 2-50
5. మహాదార్శనికుడు — 7-00
6. బయటపడ్డ బ్రతుకులు
   (వివిధ రచయితలకు అనువాదం) — 2-50

అచ్చులో ....

7. మతవిద్రోహి - ఖలీల్ జిబ్రాన్
8. మహాప్రస్థానం పద్యకావ్యం - ఖలీల్ జిబ్రాన్
9. ఉక్కుపాదం - జాక్ లండన్ ప్రపంచ ప్రఖ్యాత నవలకు అనువాదం (ద్వితీయముద్రణము)

PIONEER
PRINTERS